శ్రీమతే రామానుజాయ నమః



# పరమార్థ స్తుతి (శ్లోకద్వయం)

(శ్రీవాత్స్య వరదగురువు (నడాదూర్ అమ్మాళ్) అనుగ్రహించినది)

# వాழி తిరునామాలు

ఆంధ్రవివరణం

**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**

ఈగ్రంథము శ్రీమతి మాచేపల్లి నాగ అన్నపూర్ణ, శ్రీమాన్ మాచేపల్లి శ్రీనివాసరావు దంపతులు ఆచార్య సమాశ్రయణం చేసికొని 25 సంవత్సరాలు పూర్తి అయిన సందర్భానికి చిహ్నంగా ఆచార్యకైంకర్యరూపంగా ముద్రింపబడినది.


ప్రతులు : 500

ముఖచిత్రం :
ముముక్షువుమోక్షమార్గం

ప్రతులకు :



శ్రీమాచేపల్లి శ్రీనివాసరావు
C/o. రూబియా మేచింగ్‌సెంటర్
న్యూక్లాత్ మార్కెట్, పాలకొల్లు
పిన్ : 534 260
సెల్ : 9440129222

శ్రీమతే రామానుజాయ నమః



# ప్రాఙ్నివేదనం

**వందేఽహం వరదార్యం తం వత్సాభిజనభూషణమ్ ।**
**భాష్యామృతప్రదనాద్యః సంజీవయతి మామపి ॥**

(శ్రీభాష్యమనే అమృతాన్ని అనుగ్రహించడం ద్వారా నన్ను కూడా ఉజ్జీవింపజేసినవారు, శ్రీవత్సకులానికి భూషణం వంటివారు అయిన ఆ వరదార్యులను నేను నమస్కరిస్తున్నాను.)

శ్రీవైష్ణవసంప్రదాయంలో ఆచార్యసార్వభౌములైన భగవద్రామానుజులకు పూర్వాశ్రమంలో ఒక మేనల్లుడు-దాశరథి (ముదలియాణ్డాన్) కాగా, ఇంకొక మేనల్లుడు-శ్రీవత్సగోత్రోద్భవులైన నడాదూర్ ఆళ్వాన్. శ్రీరామానుజులు, వీరి పాండిత్యాన్ని గమనించి వీరిని శ్రీభాష్యసింహాసనాధిపతులుగ నియమించారు. కులపతి, వరదవిష్ణ్వాచార్యులనే నామాలను కల వీరి పుత్రులు దేవరాజగురువు. వీరి కుమారులు **"నడాదూర్ అమ్మాళ్"** అనే పేరుతో ప్రసిద్ధులైన శ్రీవాత్స్య వరదగురువు. వరదరాజస్వామికి తల్లివలె సకలోపచారాలు అత్యంత శ్రద్ధతో చేసినందున **"అమ్మాళ్"** అనే పేరు వీరికి వచ్చిందని పెద్దలంటారు. వీరు, ఎఙ్గళాళ్వాన్ అని ప్రసిద్ధులైన శ్రీరామానుజుల శిష్యులైన విష్ణుచిత్తార్యులకు శిష్యులు. వారివద్దనే ఉభయవేదాంతాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. విశేషించి, శ్రీభాష్యమహాగ్రంథ రహస్యార్థాలను వారివద్ద సంపూర్ణంగా గ్రహించి, వానిని కిడాంబి ఆచ్చాన్, శ్రుత ప్రకాశికా భట్టర్ మొదలైన శిష్యులకు ఉపదేశించారు. అమ్మాళ్ శ్రీభాష్యగ్రంథాన్ని గూర్చి కాలక్షేప సమయంలో అనుగ్రహించిన దివ్యార్థాలను శ్రీసుదర్శనభట్టర్ యథాతథంగా **"శ్రుతప్రకాశికా"** అనే పేరుతో గ్రంథస్థం చేశారు. ఈ వ్యాఖ్య శ్రీభాష్యానికి ఈనాటికీ కంచుకోటవలె ప్రతివాదిదుర్భేద్యమై వెల్గొందు తున్నది.

అమ్మాళ్ రచించిన గ్రంథాలు తత్త్వసారం, ప్రపన్నపారిజాతం, ఆరాధన క్రమం, జయంతీదర్పణం, హేతిరాజసప్తకం, ద్రవిడోపనిషత్ సంగ్రహం, పరత్వాది పంచకం, శ్లోకద్వయం మొదలైవి చాలా ఉన్నాయి. ఈ గ్రంథాల ఆరంభంలో, చివరలో కన్పించే శ్లోకాలద్వారా అమ్మాళ్‌కు సంబంధించిన పలు చారిత్రకాంశాలు వ్యక్తమవుతున్నాయి. అమ్మాళ్ కాలాన్ని క్రీ.శ.13వ శతాబ్దిగా భావించడం సముచిత



మని శ్రీమాన్ సుదర్శనాచార్యస్వామివారు ప్రపన్నపారిజాత గ్రంథ ప్రస్తావనలో తెలిపారు.

"బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ చింతయేదాత్మనోహితమ్" (బ్రాహ్మ ముహూర్తంలో నిద్ర లేచి ఆత్మహితాన్నిగూర్చి చింతించాలి) అని శాస్త్రవచనం. ఆత్మకు హితాన్ని కల్గించే పలు అంశాలలో అర్చిరాది మార్గచింతనం కూడా ఒకటి. ఈ విషయం మనకు భగవద్రామానుజప్రణీతమైన శ్రీవైకుంఠగద్యలోని **"తతశ్చ ప్రత్యహ మాత్మోజ్జీవనాయ ఏవ మనుస్మరేత్"** అనే సూక్తి ద్వారా స్పష్టపడుతున్నది. **"ఉణ్ణుమ్ శోఱు"** అనే తిరువాయ్‌మొళ్ళి దశకంలోని **"ఇవై్వెనక్కు"** (6-7-6) అనే పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ నమ్బిళ్ళై - **"అర్చిరాదిగతియోడు, పరమపదత్తోడు, అఙ్గు పుక్కాల్ సదా దర్శనమ్ పణ్ణుమవనోడు వాశియఱ ప్రాప్యాంతర్గతమాకక్కడ వదిత్తే"** (అర్చిరాది గతితో పాటు, పరమపదంతో పాటు, అక్కడకు ప్రవేశిస్తే సదా దర్శనం చేయబడే భగవానునితోపాటు ఏమీ తేడాలేకుండా అంతా ప్రాప్యం లోకి చేరుతుంది కదా) అని అనడంకూడా స్మరణీయం. అందువల్ల మార్గచింతనం ప్రపన్నునకు పరమార్థం. ముముక్షువుయొక్క గతిచింతనను గూర్చి ఛాందోగ్యోపని షత్, బృహదారణ్యకోపనిషత్, కౌషీతకి ఉపనిషత్ మొదలైన శ్రుతులు, తిరువాయ్ మొళ్ళిలోని **'శూళ్విశుమ్బు'** దశకంలోని పాశురాలు మొదలైన దివ్యసూరి సూక్తులు ప్రస్తావించాయి. శ్రీవిష్ణుసహస్రనామంలోని 'అర్కః' అనే నామం నుండి వరుసగా పది నామాలు అర్చిరాది గతిని తెల్పుతున్నవి అని భట్టర్ తమ భాష్యంలో తెలిపారు. శ్రీపిళ్ళైలోకాచార్యులవారి 'అర్చిరాది' అనే రహస్య గ్రంథం పూర్తిగా ఈ మార్గచింత నను తెల్పుతున్నది. మార్గచింతన అనే పరమార్థాన్ని తెల్పుతున్నందున ప్రకృతస్తుతికి పరమార్థస్తుతి అనే పేరు కల్గింది.

ఈ స్తోత్రానికి సంగ్రహమైన వివరణం విన్నపింపబడుతున్నది. ఇందులోని గుణదోషాలకు గుణజ్ఞులైన విద్వాంసులు ప్రమాణం. దీనితో పాటుగా నిత్యం అనుసంధించుకొనవలసిన ఆళ్వార్లు, గోదాదేవి, శ్రీరామానుజులు, కూరేశులు, శ్రీవరవరమునులు, శ్రీరంగనాథుడు - అనే వీరి తిరునక్షత్ర, నిత్య తనియన్ శ్లోకాలు, వాళ్ళితిరునామాలు భావంతోపాటు ముద్రింపబడుతున్నాయి. ఈ చిరు గ్రంథ ప్రచురణ భక్తులను ఆనందింపజేయగలదని భావిస్తున్నాను. ఈ గ్రంథాన్ని ఆచార్య కైంకర్యరూపంగా ముద్రించడానికి తమ పవిత్ర ద్రవ్యాన్ని భక్తిశ్రద్ధలతో సమర్పించిన **శ్రీమతి మాజేటి నాగఅన్నపూర్ణ (పూర్ణ), శ్రీమాజేటి శ్రీనివాసరావు** దంపతులను, వారి కుటుంబసభ్యులను హార్దికంగా అభినందిస్తున్నాను.

ఈ.ఏ. శింగరాచార్యులు

శ్రీవాత్స్యవరదగురు (నడాదూర్ అమ్మాళ్) ప్రణీతమైన

# పరమార్థస్తుతి

పరమార్థస్తుతి రేషా శ్రీవాత్స్యవరదగురూత్తమప్రోక్తా ।
అనుసంధేయా నిత్యం విప్రియతే శింగరార్యేణ ॥

1) సత్సంగాత్ భవనిస్పృహో గురుముఖాత్ శ్రీశం ప్రపద్యాత్మవాన్ ।
ప్రారబ్ధం పరిభుజ్య కర్మశకలం ప్రక్షీణకర్మాంతరః ॥
న్యాసాదేవ నిరంకుశేశ్వరదయా నిర్లూనమాయాన్వయో ।
హార్దానుగ్రహలబ్ధమధ్యధమనిద్వారాత్ బహిర్నిర్గతః ॥

మానవుడు సత్పురుషుల సహవాసంవల్ల సంసారంపట్ల ఆసక్తి లేనివాడై ముముక్షువు అవుతాడు. అపుడు సదాచార్యుని ద్వారా శ్రియఃపతిని శరణాగతి చేసి సత్తను కల్గినవాడవుతాడు. ఆ పిమ్మట ప్రారబ్ధకర్మఫలాన్న దేహావసాన పర్యంతం అనుభవించి, సంచిత - ఆగామికర్మల ఫలాన్ని భగవదనుగ్రహంవల్ల పోగొట్టు కొంటాడు. తాను చేసిన ప్రపత్తివల్ల సంతోషించిన, నిరంకుశ స్వతంత్రుడైన భగవానుని నిర్హేతుక కృపాఫలంగా మాయ అనబడే ప్రకృతితో సంబంధాన్ని పూర్తిగా లేకుండా చేసికొన్నవాడై, తన హృదయంలో నిరంతరం వేంచేసి ఉండే జనార్దనుని అనుగ్రహం వల్ల సుషుమ్న అనబడే మధ్యధమనిద్వారా దేహంనుండి బయటకు వస్తాడు.

**(సత్సంగాత్)** - సజ్జనుల సాంగత్యంవల్ల- అని అర్థం. ఇచటి "సత్" అనే పదం సత్తను కల్గిన పరమభాగవతోత్తములను తెల్పుతున్నది. వీరు- **"అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదుః"** (పరమాత్మ ఉన్నాడని, అతనికి స్వరూపరూపగుణ విభూతిలీలాదులున్నవని తెలిసినవానిని సత్తను కల్గినవానినిగా సత్పురుషులు తెలిసికొంటున్నారు) అన వేదంచేత తెలుపబడిన తత్త్వజ్ఞులు. ఇటువంటి మహనీయులను భగవానుడు **"ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినః తత్త్వదర్శినః"** (తత్త్వాన్ని దర్శించిన జ్ఞానులు నీకు జ్ఞానాన్ని ఉపదేశిస్తారు) అని, **"స మహాత్మా సుదుర్లభః"** (ఆ మహాత్ముడు చాలా అరుదుగా లభిస్తాడు.) అని, **"జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్"** (జ్ఞాని నాకు ఆత్మయే - అని నా అభిప్రాయం) అని ఈవిధంగా భగవానునిచే ప్రశంసింపబడ్డాడు. తమ తమ వర్ణాశ్రమానుగుణాలైన ధర్మాలను



భగవత్కైంకర్య బుద్ధ్యా ఆచరించేవారు, శత్రువులు, మిత్రులు, ఉదాసీనులనే మూడు విధాలైన వ్యక్తులపట్ల సమబుద్ధిని, సమవర్తనాన్ని కలవారు, భగవత్కృపకోసం, చాతకపక్షి వర్షంకోసంవలె, ఎదురు చూచేవారు, భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠులై ఉండే మహనీయులు, వీరు. ఇటువంటి సత్పురుషులతో స్నేహం మోక్షహేతువు కాగలదు. **"నల్లగుణముడైయోర్ తజ్గళుడన్ కూడియిరుప్పార్క్కు కుణమదు వేయామ్ శేర్త్తి కొణ్డు"** (సద్గుణాలను కలవారితో చేరిన వారికి ఆ స్నేహప్రభావం చేత వారి సద్గుణాలు కలుగుతాయి) అని ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో శ్రీవరవరమునులు సత్సంగప్రభావాన్ని, ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పారు.

**(భవనిస్పృహః)** - సంసారంపట్ల విరక్తిని పొందినవాడై - అని అర్థం. భవమంటే పుట్టుక. అనాదిగా పరంపరారూపంలో జీవుని వదలక వెంటనంటి ఉండే దేహసంబంధం. ఇది ఒక్కొక్క జీవునకు ఒక్కొక్క రూపంలో ఉంటుంది. ఆ యా జీవులు చేసిన కర్మలకు అనుగుణమై, త్రిగుణాత్మకమై ఉంటుంది. అజ్ఞాన - అన్యథా జ్ఞాన - విపరీతజ్ఞానాలను కల్గించి శోకమోహాది వివిధభ్రమలకు కారణమవుతున్నది. ఈ జీవులను రక్షించడంకోసం భగవానుడు చేసే ప్రయత్నాలను అన్నిటిని కొనసాగనీయకుండా అడ్డుపెడుతుంది. ఈ ప్రకృతి సంబంధం. ఇది విధిశివాదులకు సైతం దాటరానిది, **"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా"** (త్రిగుణాత్మకమైన, దివ్యమైన ఈ మాయ ఎవరికైనా దాటరానిది) అని గీతాచార్యుడే విషయాన్ని తెలిపాడు. అందువల్ల అనాదిగా సంసారచక్రంలో పరిభ్రమించి కొట్టుమిట్టాడే ఈ జీవుడు సత్పురుషులతో సంబంధాన్ని పొందడానికికూడా కారణం, ఆ భగవానుని దివ్యకటాక్షమేనని భావించాలి. ఈ విధంగా తత్త్వజ్ఞులైన మహనీయుల సహవాసంవల్ల, వారు చేసిన తత్త్వోపదేశాలవల్ల భగవానుడైన శ్రీమన్నారాయణుడే ఉపాయం, ఉపేయమనే స్థిరమైన నమ్మిక ఏర్పడుతుంది. ఈ సంసారం అనిత్యమని, దుఃఖప్రదమనే జ్ఞానం కల్గుతుంది. అనిత్యాలైన ఈ లౌకిక సుఖాలపట్ల విరక్తి కల్గుతుంది. అపుడతనికి ఈ ప్రకృతిసంబంధాన్ని పోగొట్టుకోవాలని, నిత్యమైన భగవత్కైంకర్య రూపప్రాప్యాన్ని పొందాలనే ఆశ కల్గుతుంది. ఈ ఆశను కలవాడే ముముక్షువు.

**(గురుముఖాత్)**- ఆచార్యుని పురస్కరించుకొని -అని అర్థం. సదాచార్యుని ద్వారా ముముక్షువు భగవానుని ఆశ్రయిస్తాడు. గురువంటే అజ్ఞానమనే చీకటిని జ్ఞానమనే దీపంద్వారా పారదోలేవాడు. **"గుశబ్ద స్త్వంధకారః స్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః,**

అంధకారనిరోధిత్వాత్ గురు రిత్యభిధీయతే” (‘గు’ అనే శబ్దానికి అంధకారమని అర్థం. ‘రు’ శబ్దం నిరోధించడాన్ని తెల్పుతుంది. అజ్ఞానాంధకారాన్ని తీరుస్తాడు కనుక గురువనబడుతున్నాడు.) అనే గురుశబ్దనిర్వచనం అజ్ఞాననివర్తకత్వాన్ని తెల్పుతున్నది. **“గుహ్యం రౌతి- ఇతి గురుః”** (అత్యంతంరహస్యమైన తత్త్వాన్ని ఉపదేశిస్తాడు కనుక గురువు) - అనే ఇంకొక నిర్వచనం గురువుయొక్క జ్ఞానప్రదత్వాన్ని బోధిస్తున్నది. ఈ విధంగా అజ్ఞానాన్ని పోగొట్టడమనే అనిష్టనివృత్తిని, జ్ఞానాన్ని కల్గించడమనే ఇష్టప్రాప్తిని కల్గించేవాడే గురువు. **“ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః, మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ సదా మంత్రాశ్రయ శ్శుచిః, గురుభక్తి సమాయుక్తః పురాణజ్ఞో విశేషతః, ఏవంలక్షణసంపన్నో గురురిత్యభిధీయతే”** అని కఠవల్లీ గతమైన ద్వయోపనిషత్తులో ఆచార్యలక్షణం వివరింపబడింది. వేదంకూడా- **“పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్, నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం గురుమేవాభిగచ్ఛేత్, సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం, తస్మై స విద్వాన్ ఉపసన్నాయ సమ్యక్ ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్”** - (ఈలోకం అంతా కర్మకృతపరిణామాన్ని కల్గినదని గమనించిన బ్రాహ్మణుడు ఇహలోకసుఖాలపట్ల నిర్వేదాన్ని పొంది, నిత్య సిద్ధరూపుడైన పరమాత్మ స్వప్రయత్నాలద్వారా పొందడానికి అసాధ్యుడని తెలిసి, ఆ స్వామిని పొందే రీతిని తెలియడంకోసం అంజలిని చేస్తూ సదాచార్యుని ఆశ్రయించాలి. ఆ ఆచార్యుడు, వేదసారార్థాన్ని తెలిసినవాడై, పరమాత్మలో నిష్ఠను కలవాడై ఉండాలి. పరమవిరక్తుడు, ఆర్తుడు, తనకు శుశ్రూషను చేసేవాడు, ఆస్తికుడు, వినయాన్ని కలవాడు, శాంతి, దాంతి మొదలైన గుణాలను కలవాడైన ఆ శిష్యునకు ఆచార్యుడు ఏవిధమైన ఖ్యాతి లాభపూజాదులను ఆశించకుండా తానేవిద్యద్వారా సతతం నిర్వికారుడైన, నాశం లేని పరమాత్మను తెలిసికొన్నాడో, ఆ బ్రహ్మవిద్యను ఉపదేశించాలి) అని గురు-శిష్యలక్షణ నిర్దేశాన్ని, ఉపదేశ ప్రకారాన్ని తెల్పింది. ఈ విధమైన లక్షణపూర్తిని కల ఆచార్యుని ఆశ్రయించి, ఆ ఆచార్యునిద్వారా-

**(శ్రీశం ప్రపద్య)**- శ్రీమన్నారాయణుని శరణు వేడి - అని అర్థం. సదాచార్య సమాశ్రయణాన్ని చేసినవాడు సర్వేశ్వరుడైన శ్రియఃపతిని శరణాగతిని చేయడానికి యోగ్యుడవుతాడు. శ్రీశుడంటే లక్ష్మీపతి. **“హ్రీశ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ”** (భూదేవి, లక్ష్మీదేవి నీకు పత్నులు) అని వేదం కూడా లక్ష్మీపతియే పరతత్త్వమని నిర్ధారించింది.



ఇక్కడ శ్రీశబ్దానికి శాస్త్రాలలో తెలుపబడిన ఆఱు విధాలైన వ్యుత్పత్తులు స్మరణీయాలు. (1) భగవానుని ఆశ్రయిస్తున్నది, (2) జీవులచే ఆశ్రయింపబడు తున్నది, (3) జీవుని విజ్ఞాపనలను వింటున్నది, (4) వాటిని భగవానునకు వినిపిస్తున్నది, (5) ఆశ్రితుల దోషాలను హరిస్తున్నది, (6) తన గుణాలతో జగత్తు అంతా వ్యాపిస్తున్నవి- అనేవి ఆ ఆఱు వ్యుత్పత్తులు. **“శ్రీరిత్యేవ చ నామ తే భగవతి!”** అని అంటూ ఆళవందార్ చతుఃశ్లోకిలో **“శ్రీః”** అనే నామం లక్ష్మికి అసాధారణమైనది, విలక్షణమైనదని అన్నారు. శ్రీదేవికి ఈశుడు - భర్త - అనే అర్థమిచ్చే శ్రీశశబ్దప్రయోగం విలక్షణమైనది. లక్ష్మీపురుషకార పురస్సరంగా ఆమె వల్లభుడైన నారాయణుని ఆశ్రయించి- అని దీని తాత్పర్యం. భగవానునకు ఎన్ని తిరునామాలు ఉన్నా, లక్ష్మీసంబంధాన్ని తెలియజేసే ఈ నామం విశిష్టమైనది. భట్టర్‌కూడా శ్రీగుణరత్నకోశమనే లక్ష్మీస్తుతిలో **“భవతీసంబంధదృష్ట్యా హరిం పశ్యేమ ప్రతియామ యామ పరీచారాన్ ప్రహ్వాష్యేమ చ”** (నీ సంబంధాన్ని పురస్కరించుకొని హరిని దర్శిస్తాము, ఆశ్రయిస్తాము. ఆ స్వామికి కైంకర్యాలను చేసి ఆనందిస్తాము) అని అన్నారు. ఆశ్రయణవేళలోను, కైంకర్యదశలోను లక్ష్మీ సంబంధప్రాధాన్యాన్ని తెలుపడంకోసమే ద్వయమంత్రంలోని పూర్వవాక్య-ఉత్తరవాక్యాలు రెండు శ్రీశబ్దాన్ని కల్గినవై ఉన్నాయి. అష్టాక్షరిలోని భగవద్వాచకమైన అకారార్థాన్ని నిరూపించే శ్రీపిళ్ళైలోకాచార్యులవారు **“ఇదిలే శ్రీసంబంధ మనుసంధేయమ్”** (ఇందులో శ్రీసంబంధాన్ని అనుసంధించాలి.) అని అన్నారు. అందువల్ల జీవుని అనన్యార్హశేషత్వ- అనన్యశరణత్వ- అనన్యభోగ్యత్వరూపమైన ఆకారత్రయంలో ఆయా స్థితులకు అనుగుణమైన శ్రీసంబంధం ఉందనే విషయం వ్యక్తమవుతున్నది. పరతత్త్వం లక్ష్మీవిశిష్టమైనపుడు విశేషణాంశ అయిన లక్ష్మి సదా భాసిస్తుంది కదా!

జీవునకు భగవానునితో గల సర్వవిధబంధుత్వం నిరుపాధికమైనది, నిత్యమైనది అయినపుడు, భగవానుని నేరుగా ఆశ్రయించకుండా లక్ష్మీదేవి చేసే పురుషకారపూర్వకంగా ఆశ్రయించవలసిన ఆవశ్యకత ఏమి! అనే ప్రశ్నకు మన పూర్వాచార్యులు విశదమైన, విలక్షణమైన సమాధానాన్ని ఇచ్చారు. జీవుని స్వభావాన్ని, స్థితిని గమనించినా, పరమాత్మ స్వభావాన్ని, స్థితిని గమనించినా - లక్ష్మీదేవి పురుషకారం ఆవశ్యకమైనదే. జీవుడు అనాదిగా చేసే పలు తీవ్రమైన పాపాలను చూచి, అతడు తనను శరణాగతి చేసినా భగవానుడు క్షమించి అంగీకరించక

పోవచ్చు. భగవానుడు నిరంకుశ స్వతంత్రుడై నందువల్ల కూడా జీవుడు చేసే శరణాగతిని సఫలం కాకపోవచ్చు. అపుడు లక్ష్మీదేవి భగవానుని వద్ద తగిన రీతిలో పల్కి ఆశ్రితునిపట్ల భగవానుడు అనుగ్రహించేటట్లు చేస్తుంది. భగవానుని ఆశ్రయించేటట్లు జీవుని ప్రోత్సహిస్తుంది. ఇదే లక్ష్మీదేవి చేసే పురుషకారం. ఇటువంటి పురుషకారావశ్యకతను ప్రకృతంలోని శ్రీశబ్దం సూచిస్తున్నది.

జీవుడు భగవదనుగ్రహాన్ని పొంది, ఉజ్జీవించే మార్గాలు శాస్త్రాలలో అనేకంగా తెలుపబడ్డాయి. కర్మయోగ-జ్ఞానయోగ- భక్తియోగాదులనే మూడు మోక్షోపాయాలే అయినా, ఇవి జీవుని స్వప్రయత్నసాధ్యాలు. అంటే- శాస్త్రాలలో విధింపబడిన రీతిలో సాధకుడు వీటిని క్రమం తప్పకుండా ఆచరించి, సిద్ధిని పొందవలసి ఉన్నది. కాని, ప్రపత్తి అనే నాల్గవ ఉపాయం - తన రక్షణభారాన్ని భగవానుని సన్నిధిలో అర్పించి, తాను నిర్భయుడై, నిర్భరుడై ఉండడమే. కనుక, ఇది మిగిలిన మూడు ఉపాయాలకంటే విలక్షణమైనది. జీవుని భగవదేకపారతంత్ర్యస్వరూపానికి అనుగుణమైనది. శ్రుతికూడా దీనిని **"తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః"** అని విలక్షణమోక్షోపాయంగా కీర్తించింది. **"భగవత్ప్రవృత్తివిరోధి స్వప్రవృత్తినివృత్తిః ప్రపత్తిః"** (తన రక్షణకోసం భగవానుడు చేసే ప్రయత్నాన్ని జీవుడు స్వప్రయత్నంతో అడ్డుకోకుండా ఉండడమే ప్రపత్తి అంటే-) అనే ప్రపత్తి నిర్వచనం ప్రకారం ఇక్కడ స్మరణీయం. ఈ విధంగా శ్రియఃపతి చరణారవిందాలలో శరణాగతిని చేసి-

**(ఆత్మవాన్)-** ఆత్మను కల్గినవాడై- అని అర్థం. "ప్రపద్య ఆత్మవాన్" అని అన్నందున శ్రీమన్నారాయణుని ప్రపత్తి చేసిన తరువాతనే జీవుడు ఆత్మను కల్గినవాడవుతాడనే అర్థస్వారస్యం స్ఫురిస్తుంది. భక్తిసారులు ఈ అర్థాన్ని **"అన్ఱు నాన్ పిఱన్దిలేన్ పిఱన్దపిన్ మఱన్దిలేన్"** అని అనుసంధించారు. భగవత్సంబంధ రహితమైన జన్మ జన్మ కానేకాదని, సదాచార్యునిద్వారా భగవానుని ఆశ్రయించి నపుడు కలిన జ్ఞానజన్మే నిజమైన జన్మ అనే ఉద్దేశ్యంతోనే ఆళ్వార్లు పైసూక్తిని పలికారు. పంచసంస్కారాలలో దాస్యనామం ఒకటికదా. ఈనామమే జీవస్వరూపా నికి అనురూపమైన నామం. సదాచార్యుని ద్వారా భగవానుని ఆశ్రయించి నిజమైన జన్మను పొందిన ముముక్షువు దేహయాత్రపట్ల విరక్తుడై, ఆత్మయాత్రపట్ల రక్తిని కలవాడై, భగవానుని అనుగ్రహం కోసం ఎదురుచూస్తూ, భగవద్భాగవతాచార్య సేవలనే ధారకపోషకభోగ్యాలుగా కలవాడై, శేషజీవితాన్ని గడుపుతాడు.



**(ప్రారబ్ధం పరిభుజ్య కర్మశకలం ప్రక్షీణకర్మాంతరః)-** జీవుడు చేసే కర్మలు ప్రారబ్ధ- సంచిత - ఆగామి రూపాలలో మూడు విధాలు. ప్రారబ్ధకర్మ అంటే- ఫలాన్ని ఇవ్వడం ఆరంభించిన కర్మలు. ఇవి ధనుస్సునుండి లక్ష్యాన్ని గురిపెట్టి వదలిన బాణాలవంటివి. ఇవి అనుభవైకవినాశ్యాలు. సంచితకర్మలంటే -జీవునిచే అతడు శరణాగతి చేయడానికి ముందు చేయబడిన, ఇంకా ఫలించడం ఆరంభించని కర్మలు. ఇవి అంబులపొదిలోని, ఇంకా ఎక్కుపెట్టని బాణాల వంటివి. ఇక, ఆగామికర్మలు- శరణాగతి చేసిన తరువాత జీవుని అజ్ఞాన- ప్రమాదాలవల్ల, రుచివాసనల కారణంగా అసంకల్పితంగా చేయబడేవి. ఈ మూడిటిలో, ఆగామి కర్మలు ప్రపత్తిమహిమచేత ప్రపన్నుని అంటవు. ఇంతకుముందు అనుభవించి మిగిలిన ప్రారబ్ధకర్మలను ప్రపన్నుడు జీవించి ఉన్నంతవరకు అనుభవిస్తాడు. ఇంకా ఏమయినా ప్రారబ్ధకర్మశేషం ఉంటే అది, సంచితకర్మలు-ఈ రెండు భగవానుని సంకల్పబలంచేత నిశ్శేషంగా నశింపజేయబడుతాయి. **"సుహృదః సాధుకృత్యామ్, ద్విషంతః పాపకృత్యామ్"** అనే రీతిలో అనుభవించగా మిగిలిన ప్రారబ్ధకర్మలలో, పుణ్యకర్మలు ప్రపన్నుని అనుకూల వర్గాన్ని, పాపాలు ప్రతికూలవర్గాన్ని చేరతాయి. భగదత్తుడు అర్జునుని ప్రయోగించిన శక్తికి శ్రీకృష్ణుడు తానెదురు నిలచి, తన వక్షస్సులో గ్రహించిన మహాభారతంలోని వృత్తాంతం దీనికి తార్కాణం. సముద్రునిపై గురి పెట్టిన బాణాన్ని ఆ సముద్రునకు శత్రువులైన అసురులపై ప్రయోగించిన శ్రీరామాయణ వృత్తాంతం కూడా దీనికి ఉదాహరణ. **"శెయ్‌కున్దావరుమ్ తీమై ఉన్నడియార్క్కు త్తీర్‌త్తు, అశురర్క్కుత్తీమైకళ్ శెయ్ కున్దా!"** (తిరువాయ్-2-6-1) అని ఈ శ్రుత్యర్థాన్ని నమ్మాళ్వార్లు ద్రావిడీకరించారు. ఈవిధంగా దేహావసానంలో ప్రపన్నుని ప్రారబ్ధ-సంచిత- ఆగామికర్మలన్నీ తీరినందున అతడు పూర్తిగా కర్మవినిర్ముక్తుడు కాగలడు. కర్మజ్ఞానభక్తులనే ఉపాయాలను అనుష్ఠించేవారుమాత్రం స్వప్రయత్నం చేతనే ఈ మూడు విధాలైన కర్మలను తీర్చుకోవలసి ఉన్నది. అందువల్ల వారికి ప్రకృత జన్మావసానంలో మోక్షం కల్గుతుంది- అనే నిశ్చయం లేదు. దృప్తప్రపన్నునకు మాత్రం **"దేహావసానే మోక్షః స్యాత్"** అనే రీతిలో ప్రకృతజన్మ చివర మోక్షం సిద్ధిస్తుంది. ఆర్తప్రపన్నుడు ప్రపత్తి చేసిన వెనువెంటనే మోక్షసిద్ధికోసం తహతహలాడతాడు కనుక, అతని ప్రారబ్ధ కర్మలు అన్నీ **"సాధ్య భక్తి స్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ"** అనే రీతిలో భగవత్సంకల్పవశంచేత ప్రపత్తిద్వారా నశిస్తాయి. శ్లోకంలోని **"పరిభుజ్య"** అనే పదం ద్వారా ప్రపన్నుని కర్మశేషం నిశ్శేషంగా తీరిపోతుందని తెలుపబడింది.

**"కర్మశకలమ్"** అనే పదం ద్వారా ప్రపత్తి చేసిన తరువాత ప్రపన్నుడు అనుభవించి తీరవలసిన కర్మను చూస్తే అది చాలా స్వల్పంగా తోస్తుందనే అభిప్రాయం వ్యక్తమవుతుంది.

**(న్యాసాదేవ నిరంకుశేశ్వరదయానిర్లూనమాయాన్వయః)**- న్యాసమంటే- ప్రపత్తి. ప్రపన్నుడు చేసిన ప్రపత్తి అనేది రక్షణాపేక్షయే కదా. **"సర్వజ్ఞోఽపి విశ్వేశః సదా కారుణికోఽపి సన్, సంసారతంత్రవాహిత్వాత్ రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే"** (భగవానుడు అన్నిటిని తెలిసినవాడైనా, సదా కరుణను సహజంగా కలవాడైనా, సంసారతంత్రనిర్వాకుడు- అంటే- ఆయా జీవులు చేసిన కర్మలకు అనుగుణంగా వారికి ఫలాన్ని ఇచ్చేవాడైనందున-రక్షింపబడవ వలసిన జీవులనుండి రక్షణ ప్రార్థనను ఎదురు చూస్తాడు) అనే రీతిలో ప్రపన్నుడు చేసిన శరణాగతిరూపంలోని రక్షణ ప్రార్థనను చూచి కరుణాళువైన భగవానుని మనస్సు కఱగుతుంది. ఆ విధంగా ప్రార్థించినవానికి భగవానుడు ప్రకృతిసంబంధాన్ని సవాసనగా తీరుస్తాడు. భగవానుడు నిరంకుశుడు కనుక అతని సంకల్పానికి ఎదురొడ్డి నిలచేవాడెవడు లేడు. **"త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్"** (శ్రీరాముడు వధించదలచినవానిని రక్షించగలవాడెవడూ లేడు) అనే హనుమానుని సూక్తి దీనిని తెల్పుతున్నది. **"న తస్యేశే కశ్చన"** (భగవానుని శాసించేవాడెవడూ లేడు) ఇత్యాది శ్రుతులీ విషయాన్ని తెల్పుతున్నవి. ఈ విధంగా భగవానుడు ప్రపన్నుని ప్రకృతిసంబంధాన్ని తీర్చడం ఏ ప్రయోజనాన్ని ఆశించి చేయడు - కేవలం దయతోనే - అనే సంగతిని **"దయానిర్లూన"** అనే పదం తెల్పుతున్నది. **"వెఱిదే అరుళ్ శెయ్‌వర్"** అని దివ్యసూరి సూక్తి. **"దయా హి నామ స్వార్థనిరపేక్షా పరదుఃఖాసహిష్ణుతా"** (దయ అంటే- ఏ స్వార్థం లేని, ఇతరుల దుఃఖాన్ని సహించలేని స్వభావం) - అని కదా దయా నిర్వచనం. **"దయానిర్లూన"** అని అన్నందున ప్రకృతిసంబంధాన్ని పోగొట్టడంలో దయ ఒక ఖడ్గంవంటి ఆయుధం అని స్ఫురిస్తున్నది. నమ్మాళ్వార్లు కూడా పెరియతిరువన్దాది ప్రబంధంలో- **"అరుళ్ ఎన్నుమ్ తణ్డాల్ అడిత్తు"** అని దయను ఒక దండంగా (ఆయుధంగా) పలికారు కదా!

**(హార్దానుగ్రహలబ్ధమధ్యధమనిద్వారాత్ బహిర్నిర్గతః)** - అంతర్యామి రూపంలో జీవుల హృదయాంతరాళంలో సదా నివసిస్తూ, వారి సత్తాధారకుడైన భగవానుని అనుగ్రహంవల్ల సుషుమ్నా అనే మధ్యనాడిద్వారా శరీరావసాన సమయంలో ప్రపన్నుడు శరీరం బయటకు వెలువడతాడు. భగవానుడు సర్వప్రాణుల హృదయ



కోశాలలో వారి సత్తాస్థితి ప్రవృత్తులను నియమిస్తూ ఉంటాడని పలు ప్రమాణాలు తెల్పుతున్నవి. **"అంగుష్ఠమాత్రః పురుషః మధ్య ఆత్మని తిష్ఠతి, ఈశానో భూతభవ్యస్య", "అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా"** ఇత్యాది శ్రుతులు, **"గుహాం ప్రవిష్టౌ ఆత్మానౌ హి తద్దర్శనాత్"** ఇత్యాది బ్రహ్మసూత్రాలు, **"ఉళ్ళియే పది కిడన్దు సత్తైయే పిడిత్తుక్కొణ్డు పోరుమ్"** ఇత్యాది పూర్వాచార్యసూక్తులు స్మరణీయాలు. సర్వస్వామి అయిన భగవానుడు తన సొత్తు అయిన జీవుని అనాదికాలంగా కోల్పోయి బాధపడేటపుడు, జీవుడు చేసిన రక్షణ ప్రార్థనను చూచి అతనిని రక్షించడంలో తనకిచ్చిన అవకాశాన్ని జారవిడువడు కదా! ఇక ఏనాటికీ ప్రపన్నుడు ప్రకృతి సంబంధానికి వశం కాకుండా ఉండేటట్లుగా అంతర్యామియైన హార్దజనార్దనుడు **"అమలజ్గళాక విళిక్కుమ్"** అనే రీతిలో తన చల్లని, తీయని పావనాలైన కటాక్షాలను అతనిపై నిర్యాణసమయంలో కురిపిస్తాడు **"అహం స్మరామి"** అనే తన ప్రతిజ్ఞకు అనుగుణంగా స్మరించి, సుషుమ్నా అనే మధ్యనాడి ద్వారా ప్రపన్నుడు ప్రాకృతదేహం నుండి బయటకు వచ్చేటట్లుగా దారి చూపిస్తాడు. ఈ సుషుమ్నా నాడి ఇడా, పింగళా - అనే రెండు నాడుల మధ్య ఉన్నది కనుక, దీనికి మధ్య ధమని(మధ్యనాడి) అని పేరు. ఈవిధంగా భగవానుని అనుగ్రహం వల్ల మధ్యనాడి నుండి నిష్క్రమణం సంభవిస్తుందని తెలుపబడడం వల్ల **"అంతిమ స్మృతి వర్జనమ్"** అనే రీతిలోని అంతిమస్మృతి నియమం లేదని తెలుస్తున్నది. ఈ మొదటి శ్లోకంలో జీవుడు ప్రాకృతసంబంధాన్ని తీర్చుకొనే పర్యంతంగల వివరం తెలుపబడింది.

**2)** **ముక్తోఽర్చిర్దినపూర్వపక్ష షడుదగ్ మాసాబ్దవాతాంశుమత్**
**గ్లౌః విద్యుద్వరుణేంద్రధాతృమహితః సీమాంతసింధ్వాప్లుతః ।**
**శ్రీవైకుంఠ ముపేత్య నిత్యమజడం తస్మిన్ పరబ్రహ్మణః**
**సాయుజ్యం సమవాప్య నందతి సమం తేనైవ ధన్యః పుమాన్ ॥**

ఈవిధంగా ముక్తిని పొందిన పురుషుడు అర్చిస్సు - దినం - శుక్లపక్షం - ఉత్తరాయణం - సంవత్సరం - వాయువు - ఆదిత్యుడు - చంద్రుడు - విద్యుత్తు, వరుణుడు - ఇంద్రుడు - ప్రజాపతి అనే అతివాహిక పురుషులచే సత్కరింప బడినవాడై, ప్రకృతిమండలం చివరివరకు ప్రయాణం చేసి, అక్కడ ఉండే విరజానదిలో స్నానంచేసి, ప్రకృతిసంబంధవాసనను పూర్తిగా నశింపజేసికొని నిత్యమైనది, జడం కానిది అయిన వైకుంఠనగరంలో ప్రవేశం చేస్తాడు. అక్కడ

అమానవుని కరస్పర్శతో సత్త్వమయమైన, ప్రకాశించే రూపాన్ని, స్వస్వరూపావిర్భావాన్ని పొంది. పరమాత్మతో సామ్యాన్ని పొందుతాడు. భగవానునితో కలసి ముక్తానందాన్ని పొందుతాడు. అపుడే పురుషుడు (జీవుడు) ధన్యుడవుతున్నాడు.

**(ముక్తః)** - ముక్తుడని అర్థం. ఇంతకుముందు తెలుపబడిన రీతిలో ప్రకృతి సంబంధంనుండి ముక్తిని పొందిన ప్రపన్నుడు అర్చిరాదిగతిద్వారా పరమపదాన్ని చేరే క్రమం ఎటువంటిదో, అక్కడ అతడు పొందే ఆనందం ఎటువంటిదో ఈ శ్లోకంలో తెలుపబడుతున్నది. **"ముక్తః"** అనే వ్యవహారం ప్రకృతిసంబంధం తీరిన తరువాతనే కల్గుతుందనే విషయం దీనివల్ల తెలుస్తున్నది. అందువల్ల జీవన్ముక్తుడనే కొందఱి వ్యవహారం అప్రధానమేకాని, ముఖ్యం కాదని గమనించాలి.

**(అర్చిర్దిన.. ధాతృమహితః)** - ప్రకృతిసంబంధంనుండి ముక్తిని పొందిన జీవుడు పయనించే అర్చిరాది మార్గాన్ని ఛాందోగ్యోపనిషత్తు- **"అర్చిషమేవాభిసంభవంతి, అర్చిషోఽహ రహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణపక్షాత్"** ఇత్యాదిగా తెలియజేసింది. శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అర్చిరాది- అనే రహస్యగ్రంథంలోని ద్వితీయప్రకరణంలో దీనినిగూర్చి విశదంగా తెలిపారు.

ముక్తుడు ముందుగా అర్చిరాభిమాని పురుషుని చేరతాడు. ఆ పురుషుడు ముక్తుని వెంట తీసికొనిపోగా అహోభిమానిదేవతను, ఆ పిమ్మట వరుసగా శుక్లపక్షాభిమానిని, ఉత్తరాయణాభిమానిని, సంవత్సరాభిమానిని, వాయువును చేరతాడు. వారు తనను తోడ్కొనిపోగా **"ప్రవిశ్య చ సహస్రాంశుమ్"** (సూర్యమండలాన్ని ప్రవేశించి) అనే రీతిలో సూర్యమండలాన్ని చేరి, దానిని దాటి చంద్రమండలాన్ని ప్రవేశిస్తాడు. అతడు సత్కరించగా పయనించి వైద్యుత పురుషుని చేరతాడు. ఈ వైద్యుత పురుషుడే అమానవుడు. అతడు వెంట తీసికొనిపోగా వరుణుని, త్రైలోక్యపాలకుడైన ఇంద్రుని, తరువాత ప్రజాపతిని చేరతాడు. (వరుణ, ఇంద్ర, ప్రజాపతులు కేవలము అనుగ్రాహకులు మాత్రమే. వారికి ఆతివాహికత్వము లేదు.) ఆ తర్వాత బ్రహ్మాండాన్ని, ఒక దానికి ఇంకొకటి పదింతలుగా ఉండే ఏడు ఆవరణాలను, చివరగా మూలప్రకృతిని దాటతాడు. పూర్వం తాను సంసారియై ఉండే సమయంలో, యమలోకంలో పడిన బాధలవల్ల కల్గిన శ్రమ తీరేటట్లుగా మిక్కిలి సుఖకరమైన మార్గంలో పయనిస్తాడు,

**(సీమాంతసింధ్వాప్లుతః)**- క్రమంగా **"స ఆగచ్ఛతి విరజాతీరమ్"** అనే కౌషీతకీ ఉపనిషత్తులో చెప్పబడిన రీతిలో అమృతనదియై, వైతరణికి విరుద్ధమైన విరజానదిని చేరి, దానిలో స్నానమాడతాడు. ఆ విరజాస్నానప్రభావంచేత సూక్ష్మ శరీరసంబంధం పూర్తిగా తీరిపోగా, **"సూర్యకోటిప్రతీకాశః"** (వేయిమంది సూర్యుల కాంతితో సాటి వచ్చే కాంతిని కలవాడై) అనే రీతిలో సహజమైన, నిరవధికమైన తేజస్సును కలవాడవుతాడు. చతుర్భుజుడు, శంఖచక్రధారి, విరజానదీతీరంలో వేచి ఉండేవాడైన అమానవపురుషుని సమీపించి, అతడు తన చేతులతో స్పృశించగా లావణ్యసౌందర్యాదులను కల్గినది, శుద్ధసత్త్వమయమైనది, భగవదనుభవ (కైంకర్య) సాధనమైన దివ్యరూపాన్ని పొందుతాడు. (ఈ అమానవ పురుషుడు ఆతివాహికుడైన అమానవపురుషుని కంటే భిన్నుడు.)

**(శ్రీవైకుంఠ ముపేత్య నిత్యమజడమ్)**- **"త్రిపాదస్యామృతం దివి"** అని కీర్తింపబడే పరమపదలోకాన్ని చేరి, అక్కడ **"తం పంచశతాన్యప్సరసాం ప్రతిధావంతి"** (అయిదు వందలమంది దివ్యలైన అప్సరసలు ముక్తుని అనుసరిస్తూ సేవచేస్తారు) అనే శ్రుతివాక్యక్రమంలో, దివ్యాప్సరసలద్వారా దివ్యమాలికలచే, దివ్యవస్త్రాలచే, దివ్యగంధానులేపనాలచే, దివ్యాంజనాలచే, దివ్యాలంకారాలచే ముక్తాలంకారం చేయబడతాడు. భగవానుని ఆజ్ఞానుసారం వైనతేయుడు తెచ్చిన దివ్యవిమానాన్ని ఎక్కి, వైకుంఠదివ్యనగరాన్ని చేరతాడు. అక్కడ రాజమార్గంలో పయనిస్తూ భగవద్దివ్యవిమానాన్ని సమీపించి మాటి మాటికి భక్తితో, వినమ్రతతో భగవానునకు నమస్కరిస్తాడు. కొంతదూరం ప్రయాణించి ఆనందమయమైన వేయి స్తంభాలను కల ఆస్థానమండపాన్ని చేరతాడు.

**(తస్మిన్ పరబ్రహ్మణః సాయుజ్యం సమవాప్య)** - అక్కడ సదా భగవత్కైంకర్యాన్ని చేస్తూ, **"నమో నారాయణాయ"** అని నమస్కరించే నిత్యసూరులను ముక్తులను దర్శించి, వారు పలికే మధురవాక్యాలను వింటాడు. దివ్యాస్థానసమీపంలో శంఖచక్రాదిదివ్యాయుధాలు తమకు అనుగుణమైన శరీరపరిగ్రహాన్ని చేసి దారి చూపగా దివ్యసింహాసనంలో ఆసీనుడైన భగవానుని దివ్యపర్యంకాన్ని సమీపించి, దానిని అధిరోహిస్తాడు. మహానందంతో భగవానునకు నమస్కరిస్తాడు. తనను చూచి ఆదరంతో దగ్గరకు తీసుకొని, ఒడిలో కూర్చుండబెట్టుకొన్న భగవానుడు "నీవెవ్వరు?" అని అడుగగా, "నేను నీకు ప్రకారభూతుడను, నీకు శేషమై, నీకు భోగ్యమై ఉన్నాను" అని సమాధానాన్ని పల్కి, భగవదనుజ్ఞతో సర్వదేశ- సర్వకాల- సర్వావస్థలకు అనుగుణమైన కైంకర్యాన్ని చేస్తూ ఉంటాడు. **"సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా"** అని వేదంలో చెప్పబడిన రీతిలో సాయుజ్యాన్ని

పొందుతాడు. **“న కాల స్త్రత వై ప్రభుః”** అనే రీతిలో పరమపదం కాలకృత విపరిణామం లేని చోటు కనుక, శుద్ధసత్త్వమయమైనది, స్వయం ప్రకాశకమైనది కనుక అజడం. **“సాయుజ్య ముభయో రత్ర భోక్తవ్యస్యావిశిష్టతా”** ‘(సాయుజ్య మంటే- జీవపరమాత్మలకు భోగ్యవస్తువు ఒకటిగా ఉండడమే) -అని సాయుజ్యం నిర్వచింపబడింది. భగవానుని స్వరూపరూపగుణ విభూత్యాదులు ముక్తునకువలెనే, భగవానునకు కూడా **“తతోఽపి తత్ ప్రియతరమ్”** అనే రీతిలో అనుభావ్యాలు కనుక, జీవుడు పరమాత్మతో సాయుజ్యాన్ని పొందుతాడని చెప్పబడింది. ముక్తదశలో జీవుడు అనుభవించి ఆనందించేవి - భగవత్ స్వరూపరూపగుణ విభూత్యాదులే కదా! భగవానుని ఆనందం- స్వాధీనం కాగా, ముక్తానందం భగవత్సంకల్పాధీనమై ఉంటుంది. అంతే తప్ప, జీవపరబ్రహ్మల ఆనందాంశంలో తారతమ్యం ఉండదు.

**(తేనైవ ధన్యః పుమాన్)** - ఈ విధంగా ఆ భగవానునిచేతనే జీవుడు భగవత్కైంకర్యరూపసంపదను పొందినవాడై ఆనందిస్తున్నాడు. ఇచటి **“ఏవ”** అనే పదాన్ని **“సర్వం వాక్యం సావధారణ”** మనే క్రమంలో **“తేనైవ, నందత్యేవ, సమమేవ”** అని సుఖంలో, సామ్యంలో పరమాత్మలో అన్వయించి అర్థం చెప్పడం సరసం. **“నందత్యేవ”** అనే అన్వయం వల్ల ఎల్లప్పుడు ఆనందిస్తాడనే అర్థం స్ఫురిస్తుంది కనుక, ముక్తుడు తిరిగి సంసారంలో పడే అవకాశం ఎంతమాత్రం లేదని తెలుస్తున్నది. **“న చ పునరావర్తతే న చ పునరావర్తతే”** అని శ్రుతికూడా ఈ విషయాన్ని తెలిపింది. ఆళ్వార్లు కూడా **“మీట్చి యిన్టి వైకున్దమానకర్”** అని అన్నారు.

ప్రాతర్నిత్యానుసంధేయం పరమార్థం ముముక్షుభిః ।
శ్లోకద్వయేన సంక్షిప్తం సువ్యక్తం వరదోఽబ్రవీత్ ॥

ఉదయకాలంలో ముముక్షువులు నిత్యం అనుసంధించదగిన పరమార్థాన్ని శ్రీవాత్సవరదార్యులనబడే నడాదూర్ అమ్మాళ్ రెండు శ్లోకాలతో క్లుప్తంగా, సుస్పష్టంగా పలికారు.





## పెరియ పెరుమాళ్ళు (శ్రీరంగనాథుడు) పంగుని - రోహిణి

### తిరునక్షత్ర తనియన్

తపస్యే మాసి రోహిణ్యాం తటే సహ్యాభువః స్థితమ్ ।
శ్రీరఙ్గశాయినం వన్దే సేవితం సర్వదేశికైః ॥

ఫాల్గునమాసంలోని రోహిణీ నక్షత్రంలో కావేరీ నదీతీరంలో నిలచినవాడు, ఆచార్యులందరిచే సేవింపబడినవాడైన రంగనాథుని నమస్కరిస్తున్నాను.

### నిత్యతనియన్

శ్రీస్తనాభరణం తేజః శ్రీరఙ్గేశయ మాశ్రయే ।
చిన్తామణి మివోద్భాన్త ముత్సఙ్గేఽనన్తభోగినః ॥

లక్ష్మీదేవి వక్షస్సుకు ఆభరణంవంటివాడు, ఆదిశేషుని ఒడిలో ప్రకాశించే చింతామణి వంటివాడు, తేజోరూపుడైన శ్రీరంగనాథుని ఆశ్రయిస్తున్నాను.

తిరుమకళుమ్ మణ్మకళుమ్ శిఱక్క వన్దోన్ వాళ్ళియే
శెయ్య విడై త్తాయ్మకళాల్ శేవిప్పోన్ వాళ్ళియే
ఇరువిశుమ్బిల్ వీర్ర్రిరుక్క మిమైయవర్కోన్ వాళ్ళియే
ఇడర్ కడియ ప్పాఱ్కడలై ఎయ్తినాన్ వాళ్ళియే
అరియ తయరతన్మకనాయ్ అవతరిత్తాన్ వాళ్ళియే
అన్దరియామిత్తువము మాయినాన్ వాళ్ళియే
పెరుకి వరుమ్ పొన్నినడుప్పిన్ తుయిన్టాన్ వాళ్ళియే
పెరియ పెరుమాళ్ ఎజ్గళ్ పిరాన్ అడికళ్ వాళ్ళియే.

లక్ష్మీదేవి, భూదేవి ఆనందించేటట్లు వేంచేసినవానికి మంగళం. తాను ఆజ్ఞాపించగా దేవేరులచే సేవింపబడేవానికి మంగళం. విశాలమైన పరమపదంలో వేంచేసి ఉండే నిత్యసూరుల నాథునకు మంగళం. భక్తుల దుఃఖం తీర్చడంకోసం వ్యూహరూపుడై పాలసముద్రాన్ని చేరినవానికి మంగళం. అరుదైన దశరథనందనుడై అవతరించిన వానికి మంగళం. అంతర్యామిత్వాన్ని పొందిన వానికి మంగళం. ప్రవహించి వచ్చే కావేరీనది నడుమ అర్చారూపుడై శయనించినవానికి మంగళం. మన స్వామి అయిన పెరియ పెరుమాళ్ శ్రీచరణాలకు మంగళం.

## 1. పొయ్‌కై ఆళ్వార్లు (తులామాసం - శ్రవణ నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

తులాయాం శ్రవణే జాతం కాంచ్యాం కాంచనవారిజాత్ ।
ద్వాపరే పాంచజన్యాంశం సరోయోగిన మాశ్రయే ॥

ద్వాపరయుగంలో తులా మాసంలో శ్రవణానక్షత్రంలో కంచికి సమీపంలోని తిరువెఃకా అనే క్షేత్రంలో స్వర్ణకమలం నుండి భగవానుని పాంచజన్యమనబడే శంఖంయొక్క అంశం వల్ల అవతరించిన పొయ్‌కై ఆళ్వార్లను ఆశ్రయిస్తున్నాను.

### నిత్య తనియన్

కాంచ్యాం సరసి హేమాబ్జే జాతం కాసారయోగినమ్ ।
కలయే యః శ్రియఃపత్యై రవిం దీప మకల్పయత్ ॥

కాంచీనగరంలోని సరస్సులో బంగారు తామరలో జన్మించి, శ్రీమన్నారాయణునకు సూర్యుని దీపంగా వెల్గించిన పొయ్‌కై ఆళ్వార్లను ధ్యానిస్తున్నాను.

### వాళ్ళి త్తిరునామం

శెయ్య తులావోణత్తిల్ శెకత్తుదిత్తాన్ వాళ్ళియే
తిరుకచ్చి మానకరమ్ శెళ్ళిక్క వన్దోన్ వాళ్ళియే
వైయమ్ తకళి నూఱుమ్ వకుత్తురైత్తాన్ వాళ్ళియే
వనశమలర్ క్కరువదనిల్ వన్దమైన్దాన్ వాళ్ళియే
వెయ్య కదిరోన్‌తన్నై విళక్కిట్టాన్ వాళ్ళియే
వేజ్గడవర్ తిరుమలైయై విరుమ్బువన్ వాళ్ళియే
పొయ్‌కైముని వడివళ్ళకుమ్ పొఱ్పదముమ్ వాళ్ళియే
పొన్ ముడివుమ్ తిరుముకముమ్ పూదలత్తిల్ వాళ్ళియే

అందమైన తులామాసంలోని శ్రవణ నక్షత్రంలో ఈ జగత్తులో ఉదయించిన వారికి మంగళం. కాంచీనగరం ప్రకాశించేటట్లు ఉదయించినవారికి మంగళం. "వైయమ్ తకళి" అని ప్రారంభించి నూఱుపాశురాలను అనుగ్రహించినవారికి మంగళం. తామర పూవు అనే తల్లి గర్భంలో ఉన్నవారికి మంగళం. వేడికిరణాలను కల సూర్యుని భగవానునకు దీపంగా చేసినవారికి మంగళం. శ్రీ వేంకటేశ్వరుని వేంకటాచలాన్ని విశేషంగా ఆదరించే వారికి మంగళం. పొయ్‌కై ఆళ్వార్ల రూపసౌందర్యానికి, బంగారంవలె అందమైన వారి శ్రీచరణాలకు మంగళం. వారి బంగారు కిరీటానికి, తిరుముఖానికి ఈ లోకంలో మంగళం.



## 2. పూదత్తాళ్వార్లు (తులామాసం - ధనిష్ఠా నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

తులాధనిష్ఠాసంభూతం భూతం కల్లోలమాలినః ।
తీరే పుల్లోత్పలే మల్లపుర్యా మీడే గదాంశజమ్ ॥

తులామాసంలో ధనిష్ఠా నక్షత్రంలో సముద్ర తీరంలో ఉండే తిరుక్కడల్‌మల్లై అనే దివ్యదేశంలో పూచిన నల్లకలువలోనుండి భగవానుని కౌమోదకి అనే గదయొక్క అంశతో అవతరించిన పూదత్తాళ్వార్లను స్తుతిస్తున్నాను.

### నిత్య తనియన్

మల్లాపురపురాధీశం మాధవీకుసుమోద్భవమ్ ।
భూతం నమామి యో విష్ణోః జ్ఞానదీప మకల్పయత్ ॥

పరమపురుషునకు జ్ఞానాన్ని దీపంగా వెలిగించినవారు, మాధవీ కుసుమం నుండి ఉద్భవించినవారు, తిరుక్కడల్ మల్లై అనే దివ్యక్షేత్రంలో అవతరించినవారైన పూదత్తాళ్వార్లకు నమస్కరిస్తున్నాను.

### వాళ్ళిత్తిరునామం

"అన్బే తకళి" నూఱుమ్ అరుళినాన్ వాళ్ళియే
ఐప్పశియిల్ అవిట్టత్తిల్ అవతరిత్తాన్ వాళ్ళియే
నన్‌పుకళ్ శేర్ కురుక్కత్తి నాణ్ మలరోన్ వాళ్ళియే
నల్ల తిరుక్కడన్‌మల్లై నాదనార్ వాళ్ళియే
ఇన్బురుకు శిన్దై తిరి ఇట్ట పిరాన్ వాళ్ళియే
ఎళ్ళిల్ ఞానచ్చుడర్ విళక్కై ఏత్తినాన్ వాళ్ళియే
పొన్ పురైయుమ్ తిరువరజ్గర్ పుకళ్ళురైప్పోన్ వాళ్ళియే
పూదత్తార్ తాళిణై ఇప్పూదలత్తిల్ వాళ్ళియే

"అన్బే తకళి" అని ప్రారంభమయే నూఱు పాశురాలను అనుగ్రహించిన వారికి మంగళం. అల్పిశిమాసంలో ధనిష్ఠానక్షత్రంలో అనుగ్రహించినవారికి మంగళం. గొప్ప కీర్తిని కల, మాధవీ పుష్పంలో అవతరించినవారికి మంగళం. ఆనందంతో కరిగే తమ మనస్సును వత్తిగా చేసిన స్వామికి మంగళం. ప్రకాశించే జ్ఞానదీపాన్ని వెల్గించినవారికి మంగళం. శ్రీరంగనాథుని కీర్తిని పాడినవారికి మంగళం. పూదత్తాళ్వార్ల శ్రీచరణాలకు రెండిటికి ఈలోకంలో మంగళం.

## 3. పేయాళ్వార్లు (తులామాసం - శతభిషక్ నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

తులాశతభిషగ్జాతం మయూరపురి కైరవాత్ ।
మహాంతం మహదాఖ్యాతం వందే శ్రీనందకాంశజమ్ ॥

అల్పిశిమాసంలో శతభిషక్ నక్షత్రంలో ఒక బావిలోని ఎఱ్ఱతామర పూవునుండి మయూరపురిలో భగవానుని నందకం- అనే ఖడ్గంయొక్క అంశతో అవతరించిన పేయాళ్వార్లకు నమస్కరిస్తున్నాను.

### నిత్య తనియన్

దృష్ట్వా హృష్టం తదా విష్ణుం రమయా మయిలాధిపమ్ ।
కూపే రక్తోత్పలే జాతం మహాయోగిన మాశ్రయే ॥

లక్ష్మితో కూడి ఉండే నారాయణుని దర్శించి పరమానందాన్ని పొందినవారు, బావిలోని ఎఱ్ఱ తామరపూవునుండి ఉద్భవించిన మహాయోగిని ఆశ్రయిస్తున్నాను.

### వాళి త్తిరునామం

"తిరు క్కణ్డేన్" ఎన్ఱుమ్ నూఱుమ్ శెప్పినాన్ వాళియే
శిఱన్ద ఐప్పశియిల్ శతయమ్ శెనిత్త వళ్ళల్ వాళియే
మరు క్కమళుమ్ మయిలైనకర్ వాళ వన్దోన్ వాళియే
మలర్క్కరియ నెయ్‌తల్‌తనిల్ వన్దుదిత్తాన్ వాళియే
నెరుక్కిడవే ఇడై కళియిల్ నిన్ఱ శెల్వన్ వాళియే
నేమిచ్చఙ్గన్ వడివళకై నెఞ్జిల్ వైప్పోన్ వాళియే
పెరుక్కముడన్ తిరుమళిశైప్పిరాన్ తొళువోన్ వాళియే
పేయాళ్వార్ తాళిణై ఇప్పెరునిలత్తిల్ వాళియే

"తిరు క్కణ్డేన్" అని ప్రారంభమయ్యే నూఱు పాశురాలను పాడినవారికి మంగళం. గొప్ప అల్పిశిమాసంలో శతభిషక్ నక్షత్రంలో అవతరించినవారికి మంగళం. పరిమళం గుబాళించే మయిలాపురి ఉజ్జీవించేటట్లు అవతరించినవారికి మంగళం. ఎఱ్ఱ తామర పూవులో అవతరించినవారికి మంగళం. తిరుక్కోవలూర్‌లోని ఇంటి నడుమ భాగంలో భగవానునిచేత సంమర్దం కల్గించబడ్డ భాగ్యవంతునకు మంగళం. శ్రీసుదర్శన శ్రీపాంచజన్యధారి అయిన భగవానుని సౌందర్యాన్ని మనస్సులో



స్మరించేవారికి మంగళం. భక్తితో తిరుమళిశై ప్పిరాన్‌చే సేవింపబడేవారికి మంగళం. ఈ విశాలమైన భూలోకంలో పేయాళ్వార్ల శ్రీచరణాలు రెండిటికి మంగళం.

## 4. తిరుమళిశైప్పిరాన్ (మకర మాసం - మఘ నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

మఘాయాం మకరే మాపి చక్రాంశం భార్గవోద్భవమ్ ।
మహీసారపురాధీశం భక్తిసార మహం భజే ॥

మకరమాసం మఘానక్షత్రంలో సుదర్శనుని అంశతో భార్గవమహర్షికి కుమారుడుగా అవతరించినవారు, మహీసారపురానికి- అంటే- తిరుమళిశై అనే అగ్రహారానికి అధిపతులైన భక్తిసారమునిని నేను భజిస్తున్నాను.

### నిత్య తనియన్

శక్తిపఞ్చమయవిగ్రహాత్మనే శుక్తికారజతచిత్తహారిణే ।
ముక్తిదాయకమురారిపాదయోః భక్తిసారమునయే నమో నమః ॥

అయిదు శక్తుల రూపంలోని అప్రాకృతాలైన పంచభూతాలతో ఏర్పడిన భగవానుని దివ్యరూపాన్ని తమలో కలవారు, ముత్యపు చిప్పవలె చూచేవారి మనస్సును ఆకర్షించేవారు, ముక్తినిచ్చే మురారి పాదాలలోని భక్తి యొక్క సారం మూర్తీభవించినట్లున్నవారైన భక్తిసారమునికి మాటిమాటికి నమస్కరిస్తున్నాను.

### వాళి త్తిరునామం

అన్బుడన్ అన్దాది తొణ్ణూఱ్ఱుఱైత్తాన్ వాళియే
అళకారుమ్ తిరుమళిశై అమర్న్ద శెల్వన్ వాళియే
ఇన్బమికు తైయిల్ మకత్తిన్ ఇఙ్గు వన్దాన్ వాళియే
ఎళిల్ శన్దవిరుత్తమ్ నూఱ్ఱిరుపతు ఈన్దాన్ వాళియే
మున్బుకత్తిల్ వన్దుతిత్త మునివనార్ వాళియే
ముళు ప్పెరుక్కిల్ పొన్ని ఎతిర్ మితన్ద శొల్లోన్ వాళియే
నన్బువియిల్ నాలాయిరత్తెళునూఱ్ఱాన్ వాళియే
నఙ్గళ్ పత్తిశారర్ ఇరు నఱ్పదఙ్గళ్ వాళియే

జీవులపట్ల ప్రేమతో 96 పాశురాలను కల నాన్ముకన్ తిరువన్దాది ప్రబంధాన్ని అనుగ్రహించిన చెప్పిన వారికి మంగళం, అందం అతిశయించి ఉండే తిరుమళిశైలో

వేంచేసి ఉండే భక్తిసంపన్నులకు మంగళం. బహుసుఖప్రదమైన తైమాసం మఘా నక్షత్రంలో ఈలోకంలో అవతరించినవారికి మంగళం. ప్రకాశించే తిరుచ్చందవిరుత్త ప్రబంధాన్ని 120 పాశురాలతో అనుగ్రహించినవారికి మంగళం. పూర్వం ద్వాపర యుగంలో ఈ లోకానికి వచ్చి అవతరించిన మునీంద్రులకు మంగళం. పూర్ణమైన కావేరీనదీ ప్రవాహంలో ఈది ఎదురు వచ్చిన శ్రీసూక్తులను కలవారికి మంగళం. ఈ భూమిలో 4,700 సంవత్సరాలు జీవించినవారికి మంగళం. మన భక్తిసారుల చక్కని శ్రీచరణద్వయానికి మంగళం.

## 5. నమ్మాఴ్వార్ (వృషభ మాసం - విశాఖా నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

వృషభే తు విశాఖాయాం కురుకాపురి కారిజమ్ ।
పాండ్యదేశే కలే రాదౌ శఠారిం సైన్యపం భజే ॥

కలియుగాదిలో వైశాఖమాసంలోని విశాఖానక్షత్రంలో పాండ్యదేశంలో ఉండే కురుకాపురి (తిరుక్కురుకూర్)లో "కారియార్ల"కు కుమారులై, సేనాధిపతుల (విష్వక్సేనుల) అంశతో అవతరించిన శఠకోపులను భజిస్తున్నాను) అని,

### నిత్య తనియన్

మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥

నా వంశంలోనివారికి తల్లి, తండ్రి, భార్యలు, సంతానం, సంపద అంతా నియతంగా ఏ శఠకోపులో, మా ప్రపన్నకులానికి అధిపతి, మొదటివారు అయిన ఆ నమ్మాఴ్వార్ల, వకుళ పుష్పాలతో అందంగా ప్రకాశించే శ్రీచరణ యుగాన్ని శిరసా నమస్కరిస్తున్నాను.

### వాఴి త్తిరునామం

ఆన తిరువిరుత్తమ్ నూఱు మరుళినాన్ వాఴియే
ఆశిరియ మేఴుపాట్టు అళిత్త పిరాన్ వాఴియే
ఈనమఱ అన్దాతి ఎణ్బత్తేఴు ఈన్దాన్ వాఴియే
ఇలకుతిరువాయ్‌మొఴి ఆయిరత్తొరునూఱ్ఱిరణ్డు ఉరైత్తాన్ వాఴియే



వానణియుమ్ మామాడ క్కురుకైమన్నన్ వాఴియే
వైకాశి విశాకత్తిల్ వన్దుతిత్తాన్ వాఴియే
శేనైయర్‌కోన్ అవతారమ్ శెయ్‌ద వళ్ళల్ వాఴియే
తిరుక్కురుకై చ్చడకోపర్ తిరువడికళ్ వాఴియే

నూఱు పాశురాలను కల తిరువిరుత్త ప్రబంధాన్ని అనుగ్రహించినవారికి మంగళం. ఏడు పాశురాలను కల తిరువాశిరియ ప్రబంధాన్ని అనుగ్రహించిన వారికి మంగళం. ఏ లోటు లేని రీతిలో ఎనభైఏడు పాశురాలను కల పెరియతిరువన్దాదిని అనుగ్రహించినవారికి మంగళం. ప్రకాశించే పదకొండు వందల రెండు పాశురాలను కల తిరువాయ్‌మొఴి ప్రబంధాన్ని అనుగ్రహించిన వారికి మంగళం. ఆకాశాన్ని అలంకరించే గొప్ప భవనాలు కల ఆఴ్వార్‌తిరునగరికి నాథులైనవారికి మంగళం. వైశాఖమాసం, విశాఖా నక్షత్రంలో ఈ లోకంలోకి వచ్చి అవతరించిన వారికి మంగళం. విష్వక్సేనుల అవతార రూపులైన, ఉదారులైనవారికి మంగళం. ఆఴ్వార్ తిరునగరికి నాథులైన శఠకోపుల శ్రీచరణాలకు మంగళమ్.

### వాఴిత్తిరునామం

మేదినిలియిల్ వైయాశి విశాకత్తోన్ వాఴియే
వేదత్తై శెన్దమిఴాల్ విరిత్తురైత్తాన్ వాఴియే
ఆదికురువాయ్ ప్పువియిల్ అవతరిత్తాన్ వాఴియే
అనవరతమ్ శేనైయర్‌కోన్ అడి తొఴువోన్ వాఴియే
నాదనుక్కు నాలాయిరమురైత్తాన్ వాఴియే
నన్మదురకవి వణఙ్గుమ్ నావీఱన్ వాఴియే
మాదవన్ పొఱ్పాతుకైయాయ్ వళర్న్దరుళ్వోన్ వాఴియే
మకిఴ్‌మాఱన్ శడకోపన్ వైయకత్తిల్ వాఴియే

భూలోకంలో వైశాఖ మాసం విశాఖా నక్షత్రంలో అవతరించినవారికి మంగళం. వేదాన్ని ద్రావిడభాషలో వివరించి పల్కినవారికి మంగళం. ప్రథమాచార్యులై ఈ భూమిలో అవతరించినవారికి మంగళం. సదా విష్వక్సేనుల శ్రీచరణాలను కొలిచేవారికి మంగళం. నాథమునికి నాలాయిరాన్ని అనుగ్రహించిన వారికి మంగళం. గొప్ప మధురకవులు నమస్కరించే వాగ్వైభవాన్ని కలవారికి మంగళం. మాధవుని అందమైన పాదుకగా వెలిగే వారికి మంగళం. వకుళ పుష్పాలతో అలంకరింపబడిన మాఱన్ అనే పేరుకల శఠకోపులకు ఈ భూమిలో మంగళం.

## 6. కులశేఖరాళ్వార్ (కుంభ మాసం - పునర్వసు నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

కుంభే పునర్వసౌ జాతం కేరళే చోళపత్తనే ।
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే ॥

కేరళదేశంలో **"కొల్లినకర్" (తిరువఞ్జిక్కళమ్)** అనే రాజధానినగరంలో మాశిమాసం పునర్వసు నక్షత్రంలో భగవానుని వక్షఃస్థలంలో ఉండే కౌస్తుభం అనే రత్నంయొక్క అంశతో, చేరదేశానికి ప్రభువై అవతరించిన కులశేఖరులను ఆశ్రయిస్తున్నాను.

### నిత్య తనియన్

ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే ।
తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్ ॥

ఎవరి రాజధానినగరంలో ప్రతిదినం రంగయాత్ర ఘోషింపబడుతున్నదో, అటువంటి కులశేఖరాఴ్వార్లను నేను శిరసా నమస్కరిస్తున్నాను.

### వాఴిత్తిరునామం

**అఞ్జనమామలై ప్పిఱవి ఆదరిప్పోన్ వాఴియే**
**అణియరఙ్గర్ మణత్తూణై అడైన్దుయ్న్దోన్ వాఴియే**
**వఞ్జినకరమ్ తన్నిల్ వాఴ వన్దోన్ వాఴియే**
**మాశితన్నిల్ పునర్పూశమ్ వన్దుదిత్తాన్ వాఴియే**
**అఞ్జలెన క్కుడప్పామ్బిల్ అఙ్గై యిట్టాన్ వాఴియే**
**అనవరతమ్ ఇరామకతై అరుళుమవన్ వాఴియే**
**శెఞ్జొల్ మొఴి నూఱ్ఱఞ్జు శెప్పినాన్ వాఴియే**
**శేరలర్కోన్ శెఙ్గమల త్తిరువడికళ్ వాఴియే**

వేంకటాద్రిపై జన్మను ఆదరించినవారికి మంగళం. అందమైన శ్రీరంగంలో ఉండే శ్రీరంగనాథుని ఆలయంలోగల ఆమోద స్తంభాలను చేరి జీవించినవారికి మంగళం. తిరువంజిక్కళమ్ అనే క్షేత్రం తరించేటట్లు అవతరించినవారికి మంగళం. మాఘ మాసంలోని పునర్వసు నక్షత్రంలో అవతరించిన వారికి మంగళం. భయపడవద్దని అంటూ పాము ఉండే కుండలో చేయిని పెట్టి ప్రమాణం చేసిన వారికి మంగళం. నిత్యం శ్రీరామ గాథను ఆలకించేవారికి మంగళం. అందమైన నూటఅయిదు పాశరాలను పెరుమాళ్ తిరుమొళి ప్రబంధాన్ని అనుగ్రహించిన



వారికి మంగళం. చేరదేశ ప్రభువైన కులశేఖరుల అందమైన తామరలవంటి పాదాలకు మంగళం.

## 7. పెరియాఴ్వార్ (మిథున మాసం - స్వాతి నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

మిథునే స్వాతిజం విష్ణో రథాశం ధన్వినః పురే ।
ప్రపద్యే శ్వశురం విష్ణోః విష్ణుచిత్తం పురశ్శిఖమ్ ॥

మిథునమాసం (అంటే - ఆనిమాసం)లోని స్వాతి అనే నక్షత్రంలో, విష్ణువుకు వాహనమైన గరుడుని అంశతో, పూర్వశిఖాశ్రీవైష్ణవబ్రాహ్మణకులంలో అవతరించిన వారు, శ్రీరంగనాథునకు మామగారైన విష్ణుచిత్తులను (పెరియాఴ్వార్లను) శరణు పొందుతున్నాను.

### నిత్య తనియన్

గురుముఖ మనధీత్య ప్రాహ వేదానశేషాన్
నరపతిపరిక్లృప్తం శుల్క మాదాతుకామః ।
శ్వశుర మమరవంద్యం రఙ్గనాథస్య సాక్షాత్
ద్విజకులతిలకం తం విష్ణుచిత్తం నమామి॥

పాండ్యరాజు ఏర్పాటుచేసిన వాదశుల్కాన్ని పొందగోరి, గురువు సన్నిధిలో అధ్యయనం చేయకుండానే అన్ని వేదాలను సభలో పల్కినవారు, శ్రీరంగనాథుని సాక్షాత్తు మామగారు, నిత్యసూరులకు కూడా నమస్కరించినవారు, బ్రాహ్మణపుర కుల శ్రేష్ఠులైన విష్ణుచిత్తులను నమస్కరిస్తున్నాను.

### వాఴిత్తిరునామం

నల్ల తిరుప్పల్లాణ్డు నాన్మూన్ఱోన్ వాఴియే
నానూఱ్ఱు అఱుపత్తొన్ఱుమ్ నమక్కురైత్తాన్ వాఴియే
శొల్లరియ వానితనిల్ శోది వన్దాన్ వాఴియే
తొడై శూడి క్కొడుత్తవళ్తన్ తొఴుమ్ తమప్పన్ వాఴియే
శెల్వనమ్బితన్నైప్పోల్ శిఱప్పుఱ్ఱాన్ వాఴియే
శెన్ఱు కిఴి యఱుత్తు మాల్ దెయ్వమెన్ఱాన్ వాఴియే

విల్లిపుత్తూర్ నకరత్తై విళక్కినాన్ వాళ్తియే
వేదియర్కోన్ పట్టర్ పిరాన్ మేదినియిల్ వాళ్తియే

గొప్ప తిరుప్పల్లాణ్డు ప్రబంధం పన్నెండు పాశురాలను అనుగ్రహించినవారికి మంగళం. 461 పాశురాలతో పెరియాళ్వార్ తిరుమొళ్గి అనుగ్రహించినవారికి మంగళం. వాచామగోచరమైన ఆనిమాసంలోని స్వాతీనక్షత్రంలో అవతరించినవారికి మంగళం. శూడిక్కుడుత్త నాచ్చియార్ (గోదాదేవి) తండ్రికి మంగళం. శెల్వనంబివలె గొప్ప వైభవాన్ని కలవారికి మంగళం. మధురకు పోయి వాదంలో జయించి వాద శుల్కధనం మూటను ఖండించి, భక్తవ్యామోహాన్ని కల శ్రియఃపతియే పరదైవమని పల్కినవారికి మంగళం. శ్రీవిల్లిపుత్తూర్నగరాన్ని ప్రకాశింపజేసినవారికి మంగళం. ఈ లోకంలో వైదికకులనాథులైన భట్టనాథులకు మంగళం.

## 8. తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు (ధనుర్మాసం - జ్యేష్ఠ నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

కోదండే జ్యేష్ఠనక్షత్రే మణ్డఙ్గుడిపురోద్భవమ్ ।
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపద్రేణు మాశ్రయే ॥

చోళదేశంలో "మణ్డఙ్గుడి" అనే నగరంలో మార్గళి (మార్గశీర్ష) మాసంలో జ్యేష్ఠానక్షత్రంలో భగవానుని "వైజయంతి" అనే వనమాలయొక్క అంశగా అవతరించిన తొణ్డరడిప్పొడి యాళ్వార్లను ఆశ్రయిస్తున్నాను.

### నిత్య తనియన్

తమేవ మత్వా పరవాసుదేవం రఙ్గేశయం రాజవదర్హణీయమ్ ।
ప్రాబోధకీం యోఽకృత సూక్తిమాలాం భక్తాఙ్ఘ్రిరేణుం భగవన్తమీడే॥

శ్రీరంగంలో శయనించిన శ్రీరంగనాథుని ఆ పరవాసుదేవునిగా, ప్రభువు వలె ఆరాధ్యునిగా భావించి పాశురమాలతో ప్రాబోధిక గీతాన్ని పాడినవారు, జ్ఞానాది షడ్గుణపూర్ణులైన తొండరడిప్పొడి ఆళ్వార్లను స్తుతిస్తున్నాను.

### వాళ్తిత్తిరునామం

మణ్డఙ్గుడియతనై వాళ్విత్తాన్ వాళ్తియే
మార్గళ్తియిల్ కేట్టైయతనిల్ వన్దుదిత్తాన్ వాళ్తియే



తెణ్డిరైశూళ్ అరఙ్గరైయే దెయ్వ మెన్ఱాన్ వాళ్తియే
తిరుమాలై ఒన్బదఞ్జుమ్ శెప్పినాన్ వాళ్తియే
పణ్డు తిరుప్పళ్ళియెళుచ్చి పత్తురైత్తాన్ వాళ్తియే
పావైయర్కళ్ కలవితనై ప్పళిత్త శెల్వన్ వాళ్తియే
తొణ్డు శెయ్తు తుళపత్తాల్ తులఙ్గినాన్ వాళ్తియే
తొణ్డరడిప్పొడి యాళ్వార్ తుణైప్పదఙ్గళ్ వాళ్తియే

తిరుమణ్డఙ్గుడి అనే దివ్యదేశాన్ని తమ అవతారంలో ఉజ్జీవింపజేసినవారికి మంగళం. మార్గశీర్షమాసంలోని జ్యేష్ఠానక్షత్రంలో ఈ భూమిలోకి వచ్చి అవతరించిన వారికి మంగళం. దక్షిణదిక్కులో సముద్రంచేత పరివేష్ఠితమైన శ్రీరంగంలోని శ్రీరంగనాథుడే దైవమని పల్కినవారికి మంగళం. నలభై అయిదు పాశురాలను కల తిరుమాలైప్రబంధాన్ని అనుగ్రహించినవారికి మంగళం. పూర్వం పది పాశురాలను కల తిరుప్పళ్ళి యెళుచ్చిని కృపజేసినవారికి మంగళం. కాంతలతో సంగమాన్ని నిందించిన వైరాగ్యసంపదను కలవారికి మంగళం. తులసీమాలతో శ్రీరంగనాథునకు కైంకర్యాన్ని చేసి వెలిగినవారికి మంగళం. తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల శ్రీచరణద్వంద్వానికి మంగళం.

## 9. తిరుప్పాణ్ ఆళ్వార్ (వృశ్చిక మాసం - రోహిణి నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

వృశ్చికే రోహిణీజాతం శ్రీపాణం నిచుళాపురే ।
శ్రీవత్సాంశం గాయకేంద్రం మునివాహన మాశ్రయే ॥

వృశ్చికమాసంలోని రోహిణీ నక్షత్రంలో నిచుళాపురి (ఉఱైయూర్)లో అవతరించినవారు, శ్రీవత్సమనే భగవానుని పుట్టుమచ్చ అంశను కలవారు, గొప్ప గాయకులైన మునివాహనులను (తిరుప్పాణ్ ఆళ్వార్లను) ఆశ్రయిస్తున్నాను.

### నిత్య తనియన్

ఆపాదచూడ మనుభూయ హరిం శయానం
మధ్యేకవేరదుహితు ర్ముదితాన్తరాత్మా ।
అద్రష్టృతాం నయనయో ర్విషయాంతరాణాం
యో నిశ్చికాయ మనవై మునివాహనం తమ్ ॥

కావేరీనది మధ్యలో శయనించి ఉండే శ్రీరంగనాథుని ఆపాదమస్తకం దర్శించి ఆనందించినవారై తమ కన్నులు వేఱొక విషయాన్ని చూడని స్థితిని పొందినవని నిశ్చయించిన మునివాహనులను ధ్యానిస్తున్నాను.

## వాழ்ిత్తిరునామం

ఉమ్బర్ తొழுమ్ మెఙ్ఞాన ముఱైయూరాన్ వాழ்ియే
ఉరోకణినాళ్ కార్త్తిగైయిల్ ఉదిత్త వళ్ళల్ వాழ்ియే
వమ్బవిழ் తార్ మునితోళిల్ వగుత్త పిరాన్ వాழ்ియే
మలర్క్కణ్ణిల్ వేఱొన్ఱుమ్ వైయాతాన్ వాழ்ియే
అమ్బువియల్ మతిళరఙ్గర్ అకమ్ పుకున్దాన్ వాழ்ియే
అమలనాతిపిరాన్ పత్తు మరుళినాన్ వాழ்ియే
శెమ్బొన్ అడిముడి అళవుమ్ శేవిప్పోన్ వాழ்ియే
తిరుప్పాణన్ పొఱ్పదఙ్గళ్ శకతలత్తిల్ వాழ்ియే

నిత్యసూరులు కొలిచే యథార్థజ్ఞానాన్ని కలవారు. ఉఱైయూర్‌కు నాథులైన వారికి మంగళం. కార్తీకమాసం రోహిణిలో అవతరించిన ఉదారులకు మంగళం. సువాసన వెదజల్లే పూమాలికను కల లోకసారంగముని భుజాలపై అధిరోహించిన ఉపకారకులకు మంగళం. తామరలవంటి తమ నేత్రాలతో శ్రీరంగనాథుని తప్ప వేఱొక విషయాన్ని చూడనివారికి మంగళం. అందమైన భూలోకంలో ప్రాకారాలను కల శ్రీరంగంలోని శ్రీరంగనాథుని ఆలయాన్ని ప్రవేశించినవారికి మంగళం. పది పాశురాలను కల అమలనాదిపిరాన్ ప్రబంధాన్ని అనుగ్రహించినవారికి మంగళం. శ్రీరంగనాథుని పాదాలనుండి శిరస్సు వరకు దర్శించినవారికి మంగళం. తిరుప్పాణ్ ఆழ்్వార్ల బంగారువలె అందమైన శ్రీచరణాలకు ఈ భూమిలో మంగళం.

## 10. తిరుమంగై యాழ்్వార్ (వృశ్చిక మాసం - కృత్తికా నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

వృశ్చికే కృత్తికాజాతం చతుష్కవిశిఖామణిమ్ ।
షట్ప్రబంధకృతం శార్‌ఙ్గమూర్తిం కలిహ మాశ్రయే ॥

కార్తికమాసంలో కృత్తికానక్షత్రంలో అవతరించినవారు, "నాలుకవి ప్పెరుమాళ్" అని అనబడేవారు, ఆఱు దివ్యప్రబంధాలను అనుగ్రహించినవారు, శార్‌ఙ్గమనే



భగవానుని విల్లియొక్క అంశతో అవతరించిన "కలికన్ఱి" అనబడే తిరుమంగై యాழ்్వార్లను ఆశ్రయిస్తున్నాను.

### నిత్య తనియన్

కలయామి కలిధ్వంసం కవిం లోకదివాకరమ్ ।
యస్య గోభిః ప్రకాశాభి రావిద్యం నిహతం తమః ॥

కలిదోషాన్ని పోగొట్టేవారు, గొప్ప కవి, లోకానికి సూర్యునివలె (జ్ఞాన) ప్రకాశాన్ని ఇచ్చేవారు. తమ ప్రకాశించే వాక్కులతో అజ్ఞాన తిమిరాన్ని పోగొట్టే తిరుమంగై ఆழ்్వార్లను ధ్యానిస్తున్నాను.

కలన్ద తిరుక్కార్త్తిగైయిల్ కార్త్తికై వన్దోన్ వాழ்ియే
కాశినియిల్ ఒణ్ కుఱైయలూర్ క్కావలోన్ వాழ்ియే
నలన్తికழ் ఆయిరత్తు ఎణ్బత్తునాలురైత్తాన్ వాழ்ియే
నాలైన్దు మాఱైన్దుమ్ నమక్కురైత్తాన్ వాழ்ియే
ఇలఙ్గెழு కూఱ్ఱిరుక్కై యిరుమడల్ ఈన్దాన్ వాழ்ియే
ఇమ్మూన్ఱిల్ ప్పాట్టిరునూఱ్ఱిరుపత్తేழு ఇశైత్తాన్ వాழ்ియే
వలన్తికழுమ్ కుముదవల్లిమణవాళన్ వాழ்ియే
వాట్కలియన్ పరకాలన్ మంగైయర్ కోన్ వాழ்ియే

కార్తీకమాసంలో కృత్తికా నక్షత్రంలోఅవతరించినవారికి మంగళమ్. భూమిలోని అందమైన కుఱైయలూర్ ప్రభువుకు మంగళం. ఆనందాన్ని కల్గించే (కావ్య గుణాలను) కల వేయి ఎనభైనాలుగు పాశురాలను కల్గిన పెరియతిరుమొழிని అనుగ్రహించిన వారికి మంగళం. ఇరవై పాశురాలను కల తిరుక్కుఱున్దాణ్డక ప్రబంధాన్ని, ముప్పై పాశురాలను కల తిరునెడున్దాణ్డక ప్రబంధాన్ని రచించిన వారికి మంగళం. ప్రకాశించే తిరువెళుకూఱ్ఱిరుక్కై ప్రబంధాన్ని, పెరియతిరుమడల్, శిఱియతిరుమడల్ ప్రబంధాలను అనుగ్రహించినవారికి మంగళం. ఈ మూడు ప్రబంధాలలో మొత్తం రెండువందల ఇరవైఏడు పాశురాలను పాడిన మంగళం. సద్గుణాలు ప్రకాశించే కుముదవల్లి వరునకు మంగళం. ఈటెను ఆయుధాన్ని కల్గిన, పరకాలురు అనబడే తిరుమంగైఆழ்్వార్లకు మంగళం.

## 11.ఆండాళ్(గోదాదేవి) (ఆడి మాసం-పూర్వఫల్గుని (పుబ్బ) నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

కర్కటే పూర్వఫల్గున్యాం తులసీకాననోద్భవామ్ ।
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకీమ్ ॥

పాండ్యదేశంలోని శ్రీవిల్లిపుత్తూర్‌లో పెరియాழ்వార్ల తులసీవనంలో ఆవిర్భవించినది, భూదేవియొక్క అవతారస్వరూపిణి, ఆషాఢమాసం (ఆడిమాసం) పూర్వఫల్గునీ (పుబ్బా) నక్షత్రంలో అవతరించినది, శ్రీరంగనాథుని పత్ని అయిన గోదాదేవిని నమస్కరిస్తున్నాను.

### నిత్యతనియన్

నీళాతుఙ్గస్తనగిరితటీసుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధ మధ్యాపయన్తీ ।
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుఙ్క్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః ॥

నీళాదేవి వక్షఃస్థలంపై నిదురించిన శ్రీకృష్ణునకు మేల్కొలుపు పలికి, వందల కొలది పలికి శ్రుతివాక్యాలచే తెలుపబడిన జీవుని పారతంత్ర్యాన్ని విన్నవించి, తాను ముడుచుకొని విడిచిన పూమాలికతో ఆ శ్రీకృష్ణుని బంధించి వశం చేసుకొని ఆనందించిన ఆ గోదాదేవికి పలుమార్లు నమస్కారం. ఇంకా ఇంకా నమస్కారం చేయాలి.

### వాழ்త్తిత్తిరునామం

తిరువాడిప్పూరత్తిల్ శెగత్తుదిత్తాళ్ వాழிయే
తిరుప్పావైయుమ్ ముప్పదుమ్ శెప్పినాళ్ వాழிయే
పెరియాழ்వార్ పెఱ్ఱెడుత్త పెణ్పిళ్ళై వాழிయే
పెరుమ్బూదూర్ మామునిక్కు ప్పిన్నానాళ్ వాழிయే
ఒరు నూఱ్ఱు నాఱ్పత్తుమూన్ఱురైత్తాళ్ వాழிయే
ఉయర్ అరఙ్గర్కే కణ్ణి యుకన్దళిత్తాళ్ వాழிయే
మరువారుమ్ తిరువల్లి వలనాడు వాழிయే
వణ్పుదువైనకర్ కోదై మలర్ప్పదఙ్గళ్ వాழிయే



ఆషాడమాసంలోని పూర్వఫల్గునీ నక్షత్రంలో ఈలోకంలో అవతరించిన వారికి మంగళం. ముప్పై పాశురాలను కల తిరుప్పావై ప్రబంధాన్ని పల్కినవారికి మంగళం. పెరియాழ்వార్లు పెంచి పెద్దచేసిన స్త్రీమూర్తికి మంగళం. శ్రీపెరుంబూదూరులో అవతరించిన శ్రీరామానుజ మునికి చెల్లెలకు మంగళం. నూటనలభై మూడు పాశురాలను కల నాచ్చియార్‌తిరుమొழி ప్రబంధాన్ని పల్కిన వారికి మంగళం. తన ప్రాణమైన శ్రీరంగనాథునకు పూమాలికను ఆనందంగా సమర్పించిన వారికి మంగళం. సువాసనను కల, సారవంతమైన, శ్రీవిల్లిపుత్తూరుకు సమీపంలో గల తిరువల్లి అనే పేరునుగల నాడుకు మంగళం. అందమైన శ్రీవిల్లి పుత్తూరులోని గోదాదేవి తామరపూలవంటి పాదాలకు మంగళం.

## 12. మధురకవి యాழ்వార్ (మేష మాసం - చిత్రా నక్షత్రం)

### తిరునక్షత్ర తనియన్

మేషే చిత్రాసముద్భూతం పాణ్డ్యదేశే గణాంశకమ్ ।
శ్రీపరాంకుశసద్భక్తం మధురం కవిమాశ్రయే ॥

మేషమాసంలోని చిత్తానక్షత్రంలో పాండ్యదేశంలో కుముదుడనే గణనాయకుని అంశతో అవతరించినవారు, శ్రీపరాంకుశుల గొప్ప భక్తులైన మధుర కవులను ఆశ్రయిస్తున్నాను.

### నిత్య తనియన్

హస్తస్థతాళద్వితయం ప్రపద్యే శఠారివాగ్వ్యాస ముదారకీర్తిమ్।
మాధుర్యసంశ్లిష్టకవిత్వయుక్తం మహత్వసమ్భావితబుద్ధితత్త్వమ్ ॥

చేతులలో రెండు తాళాలను కలవారు, నమ్మాళ్వార్ల వాక్కులకు వ్యాసుని వంటివారు (వ్యాసుడు వేదాలను ప్రచారం చేసినట్లు, శఠకోపుల ప్రబంధాలను ప్రచారంచేసినవారు) గొప్ప కీర్తిని కలవారు. తీయని కవిత్వాన్ని పలికేవారు. గొప్ప బుద్ధిని కలవారు (ఆచార్యభక్తి అనే గొప్ప బుద్ధిని కలవారు) అయిన మధుర కవులను శరణు పొందుతున్నాను.

### వాழ்త్తిత్తిరునామం

శిత్తిరైయిల్ శిత్తిరైనాళ్ శిఱక్క వందోన్ వాழிయే
తిరుక్కోళూరవరిత్త శెల్వనార్ వాழிయే

ఉత్తర కఙ్గాతీరత్తు ఉయర్ తవత్తోన్ వా*ళి*యే
ఒళికతిరోన్ తెఱ్కుతిక్కు పుకన్దుకవ్దాన్ వా*ళి*యే
పత్తియొడు పతినొన్ఱుమ్ పాడినాన్ వా*ళి*యే
పరాఙ్కుశనే పరనెన్ఱు ప*ఱ్ఱి*నాన్ వా*ళి*యే
మత్తిమమాయ్ పదప్పొరుళై వా*ళ్*విత్తాన్ వా*ళి*యే
మదురకవితిరువడికళ్ వా*ళి* వా*ళి* వా*ళి*యే

చైత్రమాసంలోని చిత్తానక్షత్రంలో గొప్పగా అవతరించినవారికి మంగళం. తిరుప్కోళూరులో అవతరించిన ఆచార్యాభిమానమనే సంపదను కల్గినవారికి మంగళం. ఉత్తర దేశంలోని గంగాతీరంలో గొప్ప తపస్సును చేసినవారికి మంగళం. జ్యోతిస్సు ప్రకాశించే దక్షిణదిక్కువైపు పయనించిన వారికి మంగళం. పదకొండు పాశురాలను గల కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాన్ని అనుగ్రహించినవారికి మంగళం. తమ ఆచార్యులైన పరాంకుశులే పరతత్త్వమని ఆశ్రయించినవారికి మంగళం. అష్టాక్షరిలో మధ్యమ పదమైన నమశ్శబ్దార్థాన్ని ప్రకాశింపజేసినవారికి మంగళం. మధురకవుల శ్రీచరణాలకు మంగళం. మంగళం. మంగళం.

## 13. భగవద్రామానుజులు (మేష మాసం - ఆర్ద్ర)

### తిరునక్షత్ర తనియన్

మేషార్ద్రాసంభవం విష్ణోర్దర్శనస్థాపనోత్సుకమ్ ।
తుండీరమండలే శేషమూర్తిం రామానుజం భజే ॥

తొండమండలంలో మేషమాసంలోని ఆర్ద్ర నక్షత్రంలో అవతరించినవారు, విష్ణువే పరతత్త్వమనే సిద్ధాంతాన్ని స్థాపించడంలో ఉత్సాహాన్ని కలవారు, ఆదిశేషుని అవతారరూపులైన రామానుజులను భజిస్తున్నాను.

### నిత్య తనియన్

. యో నిత్య మచ్యుతపదామ్బుజ యుగ్మరుక్మ -
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥



భగవద్రామానుజులు నిబిత్యంగా భగవానుని శ్రీచరణపద్మయుగమనే బంగారంలో కల గొప్ప వ్యామోహంవల్ల, ఆ పదపద్మాల కంటే వేఱయిన అన్ని విషయాలను గడ్డిపోచగా తలచి విడచి వేశారు. మాకు ఆచార్యులు, సమస్త కల్యాణగుణ పరిపూర్ణులు, కరుణా సముద్రులైన ఈ భగవద్రామానుజుల శ్రీచరణాలను ఉపాయంగా ఆశ్రయిస్తున్నాను.

### వా*ళి*త్తిరునామం

అఱుశమయ చ్చెడియదనై యడి యఱుత్తాన్ వా*ళి*యే
అడర్న్దు వరుమ్ కుదిట్టికళై అఱ త్తుఱన్దాన్ వా*ళి*యే
శెఱు కలియై చ్చెఱిదు మఱ త్తీర్త్తవిట్టాన్ వా*ళి*యే
తెన్నరఙ్గర్ శెల్వ ము*ఱ్ఱు*మ్ తిరుత్తివైత్తాన్ వా*ళి*యే
మఱైయదనిల్ పొరుళనైత్తుమ్ వాయ్మొ*ళి*న్దాన్ వా*ళి*యే
మాఱనురై శెయ్ద తమి*ళ్*మఱై వళర్త్తోన్ వా*ళి*యే
అఱమికు నల్పెరుమ్బూదూర్ అవతరిత్తాన్ వా*ళి*యే
అ*ళ*కారు మెతిరాశర్ అడియిణైకళ్ వా*ళి*యే

వేదబాహ్యలైన ఆఱు మతాలనే (మహా) వృక్షాలను సమూలంగా ఛేదించిన వారికి మంగళం. గుంపులు గుంపులుగా తనపైకి వాదించడంకోసం వచ్చే కుదృష్టి మతస్థులను సవాసనగా (పూర్తిగా) తఱిమికొట్టినవారికి మంగళం. లోకం అంతటా గాఢంగా ఆవరించే కఠినమైన కలిని కొంచెంకూడా మిగిలి ఉండకుండా ఉండేటట్లుగా నశింపజేసినవారికి మంగళం. దక్షిణదిక్కులోని, అందమైన శ్రీరంగనాథుని సకల సంపదలను తన ఆజ్ఞానుసారంగా సంస్కరించినవారికి మంగళం. వేదాలలో ప్రతిపాదింపబడే అర్థాలను అన్నిటినీ శ్రీభాష్యరూపంలో అనుగ్రహించినవారికి మంగళం. నమ్మా*ళ్*వార్లు అనుగ్రహించిన, ద్రావిడవేదాలుగా ప్రసిద్ధిచెందిన ప్రబంధాలను వృద్ధిచేసినవారికి మంగళం. ఆ ప్రబంధాలలో ప్రతిపాదింపబడ్డ శరణాగతి ధర్మం లోకంలో అభివృద్ధికావడంకోసం విలక్షణం అయిన శ్రీపెరుంబూదూర్‌లో అవతరించిన వారికి (లేక, ధర్మం నిండుగా ఉండే శ్రీపెరుంబూదూర్‌లో అవతరించిన వారికి) మంగళం. సౌందర్యాదులతో పూర్ణంగా ఉండే భగద్రామానుజుల శ్రీచరణాల జంటకు నిత్యమంగళం.

శీరారు మెతిరాశర్ తిరువడికళ్ వా*ళి*
తిరువరైయిల్ శాత్తియ శెన్దువరాడై వా*ళి*

ఏరారుమ్ శెయ్య అడి ఎప్పొఴుదుమ్ వాఴి
ఇలఙ్గియ మున్నూల్ వాఴి ఇణైత్తోళ్కళ్ వాఴి
శోరాద తుయ్య శెయ్య ముగచ్చోది వాఴి
తూ ముఱువల్ వాఴి తుణైమలర్ కణ్గళ్ వాఴి
ఈరాఱు తిరునామ మణిన్ద వెఴిల్ వాఴి
ఇనిదిరప్పోదెఴిల్ ఞానముత్తిరై వాఴియే

కల్యాణగుణాలు నిండుగా ఉండే యతిరాజుల శ్రీపాదాలు సదా వర్ధిల్లాలి. (వారు) నడుములో ధరించిన ఎఱ్ఱని కాషాయవస్త్రం వర్ధిల్లాలి. సౌందర్యంతో నిండిన ఎఱ్ఱని, అందమైన దివ్యమంగళవిగ్రహం సదా వర్ధిల్లాలి. వక్షఃస్థలంలో ప్రకాశించే బ్రహ్మసూత్రం వర్ధిల్లాలి. బంగారు కల్పవృక్షాలవలె మోక్షప్రదాలుగా ఉండేవి, సంసారిచేతనుల రక్షణసామర్థ్యాన్ని కల్గినవి అయిన (వారి) భుజాలు రెండు వర్ధిల్లాలి. అనుభావ్యమైనది, నిర్మలమైనది, శుభావహం అయినది అయిన తిరుముఖమండలం లోని శోభ వర్ధిల్లాలి, భగవదనుభవంవల్ల, ఆశ్రితరక్షణవల్ల కల్గిన ఆనందంచేత పుట్టిన చిఱునవ్వు వర్ధిల్లాలి. వికసించిన తామరపూలవంటి అందమైన (వారి) తిరునేత్రాలు వర్ధిల్లాలి. పూర్వం వర్ణించిన వానికి అన్నిటికీ ప్రకాశకమై, శ్రీవైష్ణవశ్రీని వర్ధిల్లజేసేవై, స్వర్ణపర్వత సమీపంలో అంతటా తామరపూలు పుష్పించినట్లుండే, ఎఱ్ఱని తిరుమేనిలో అలంకరించుకొన్న ద్వాదశోర్ధ్వపుండ్రాల ధారణచేత కల్గిన (వారి) అందం వర్ధిల్లాలి. పద్మాసనంలో వేంచేసి ఉండే సన్నివేశంలో ఉభయవేదాంతార్థప్రకాశకంగా ఉండే, పరతత్త్వ బోధకం అయిన జ్ఞానముద్రతో కూడిన (వారి) శ్రీహస్తం వర్ధిల్లాలి.

## నాళ్పాట్టు

శఙ్కరబాఙ్కర యాదవబాట్ట పిరబాకరర్తఙ్గళ్ మతమ్
శాయ్ వుఱ వాదియర్ మాయ్వురు మెన్ఱు శదుమఱై వాఴ్న్దిడునాళ్
వెఙ్గలి యిఙ్గిని వీఱు నమక్కిలై యెన్ఱు మిక త్తళర్నాళ్
మేదిని నఞ్జుమై యాఱు మెన త్తుయర్విట్టు విళఙ్గియనాళ్
మఙ్గైయరాళి పరాఙ్కుశ మున్నవర్ వాఴ్వు ముళైత్తిడునాళ్
మన్నియ తెన్నరఙ్గాపురి మామలై మఱ్ఱు మువన్దిడునాళ్
శెఙ్గయల్ వావికళ్ శూఴ్ వయల్నాళుమ్ శిఱన్ద పెరుమ్బూదూర్
శీమా నిళైయాఴ్వార్ వన్దరుళియనాళ్ తిరువాదిరై నాళే



శంకరాచార్యులవారి మతమైన అద్వైతం, భాస్కరమతం, యాదవప్రకాశుని మతం, భాట్టమతం, ప్రాభాకరుని మతం- ఇవి అన్నీ నాశాన్ని పొందగా, వాదించేవారు నిర్జితులై నశించి, నాల్గు వేదాలు వాటి యథార్థ ప్రతిపాదనవల్ల వృద్ధిపొందే సుదినం, క్రూరుడైన కలిపురుషుడు "ఇక నాకు ఇక్కడ శక్తి సామర్థ్యాలు లేవు" అని, చాలా తల్లడిల్లేటట్లుచేసే సుదినం. భూమి ఇక నా భారం తొలగిపోతుందని దుఃఖాన్ని వీడి సంతోషించే సుదినం. అర్చావతారాలను ఆదరించే తిరుమఙ్గైయాఴ్వార్ల, నమ్మాఴ్వార్ల, మిగిలిన పూర్వాచార్యులయొక్క సంపద అంకురించే సుదినం. స్థిరమైన గొప్పదైన తిరుమలై, మిగిలిన దివ్యదేశాలు అన్నీ ఆనందించే సుదినం- ఏది అంటే, ఎఱ్ఱని అందమైన చేపలను కల సరస్సులను చుట్టూ కల్గిన పంటభూములలో ఎల్లప్పుడూ గొప్పగా అందంగా ఉండే శ్రీపెరుంబూదూర్‌లో భక్తికైంకర్యలక్ష్మీసంపన్నులైన శ్రీరామానుజులు అవతరించిన ఆర్ద్రానక్షత్రమే.

## కూరత్తాఴ్వాన్ (మకర మాసం - హస్త నక్షత్రం)

### తిరునక్షత్రతనియన్

మకరే హస్తనక్షత్రే సర్పనేత్రాంశసంభవమ్ ।
శ్రీమత్కూరకులాధీశం శ్రీవత్సాంక ముపాస్మహే ॥

మకర మాసంలోని హస్త నక్షత్రంలో సర్పనేత్రుడనే నిత్యసూరుల అంశతో అవతరించినవారు. సంపదను కల కూరకులానికి అధిపతి అయిన శ్రీవత్సాంకులను ఉపాసిస్తున్నాను.

### నిత్యతనియన్

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తిమధీమహి ।
యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥

ఎవరి సూక్తులు వేదకాంత మెడలో మంగళసూత్రంగా భాసిస్తున్నాయో, ఆ శ్రీవత్సచిహ్నులకు నమస్కారోక్తిని పల్కుతున్నాము.

### వాఴి త్తిరునామమ్

శీరారుమ్ తిరుప్పతికళ్ శిఱక్క వన్దోన్ వాఴియే
తెన్నరఙ్గర్ శీరరుళై చ్చేరుమవన్ వాఴియే
పారారు మెతిరాశర్ పదమ్ పణిన్దోన్ వాఴియే
పాషియత్తి నుట్పొరుళై ప్పకరుమవన్ వాఴియే

నారాయణన్ శమయమ్ నాట్టినాన్ వాఴియే
నాలూరాన్ తనక్కు ముత్తి నల్ఴినాన్ వాఴియే
ఏరారుమ్ తైయిలత్తత్తిఙ్గు వన్దాన్ వాఴియే
ఎఴిల్ కూరత్తాఴ్వాన్‌తన్ ఇణైయడికళ్ వాఴియే

సంపద నిండుగా కల్గిన దివ్యదేశాలు ప్రకాశించేటట్లు అవతరించినవారికి మంగళం. దక్షిణదిక్కులోని శ్రీరంగంలో వేంచేసియుండే శ్రీరంగనాథుని గొప్ప కరుణను పొందినవారికి మంగళం. భూమిలో వ్యాపించిన కీర్తిని కల శ్రీరామానుజుల శ్రీచరణా లను ఆశ్రయించినవారికి మంగళం. శ్రీభాష్యంలోని సూక్ష్మార్థాలను వివరించేవారికి మంగళం. శ్రీమన్నారాయణుడే పరతత్త్వం అనే సిద్ధాంతాన్ని నిలిపినవారికి మంగళం. నాలూరాన్‌కు ముక్తిని కల్గించినవారికి మంగళం. అందం నిండిన తైమాసంలోని హస్తా నక్షత్రంలో అవతరించినవారికి మంగళం. ప్రకాశించే కూరేశుల శ్రీచరణద్వయానికి మంగళం.

పొరుళ్ విరిక్కు మెతిరాశర్ పొన్నడియోన్ వాఴియే
పొన్‌వట్టిల్‌తనై యెఱిన్ద పుకఴుడైయోన్ వాఴియే
మరుళ్ విరిక్కుమ్ ముక్కుఱుమ్బై మాఱ్ఱ వన్దోన్ వాఴియే
మయర్వఱవే మెయ్‌ఞ్ఞానమ్ విళఙ్గిడువోన్ వాఴియే
ఇరుళ్ విరిక్కుమ్ శివమెదిరిట్టెఴుత్తిట్టోన్ వాఴియే
ఏత మఱ వెవ్వుయిర్‌క్కుమ్ ఇత మళిత్తోన్ వాఴియే
అరుళ్ విరిక్కు మరఙ్గత్తానడియిణైన్దోన్ వాఴియే
అఎకారుమ్ ఆఴ్వాన్ తన్నడియిణైకళ్ వాఴియే

తత్త్వార్థాలను వివరించే శ్రీరామానుజుల అందమైన శ్రీపాదంవంటివారికి మంగళం. బంగారు పాత్రను విసరివేసిన కీర్తిని కల్గినవారికి మంగళం. అజ్ఞానాన్ని కల్గించే విద్యామదం, ధనమదం, అభిజనమదం - అనే మూడువిధాలైన గోతులను లేకుండా చేయడంకోసం వచ్చినవారికి మంగళం. అజ్ఞానం నశించేటట్లు తత్త్వజ్ఞానాన్ని ప్రకాశింపజేసేవారికి మంగళం. అజ్ఞానాన్ని వ్యాపింపజేసే శైవమతాన్ని ఎదిరించి, విష్ణువే పరతత్త్వమని వ్రాసినవారికి మంగళం. జీవులందరికీ ఏ తక్కువ దనం లేనిరీతిలో హితాన్ని అనుగ్రహించినవారికి మంగళం. కరుణ జూపే శ్రీరంగ నాథుని శ్రీచరణద్వయాన్ని ఆశ్రయించినవారికి మంగళం. అందం నిండుగా ఉండే కూరేశుల రెండు పాదాలకు మంగళం.



## శ్రీమణవాళమహామునులు (తులామాసం - మూల)

### తిరునక్షత్రతనియన్

తులాయా మతులే మూలే పాండ్యే కుంతీపురీవరే ।
శ్రీశేషాంశోద్భవం వందే రమ్యజామాతరమ్ మునిమ్ ॥

తులామాసంలో సాటి లేని, మూల అనే నక్షత్రంలో పాండ్యదేశంలోని కుంతీ పురమనబడే ఆఴ్వార్ తిరునగరిలో ఆదిశేషుల అంశతో ఉద్భవించిన శ్రీవరవరముని లను నమస్కరించి, స్తుతిస్తున్నాను.

### నిత్యతనియన్

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥

శ్రీశైలేశులనబడే తిరువాయ్‌మొఴి పిళ్ళై దయకు పాత్రులు, జ్ఞానభక్త్యాది గుణాలకు సముద్రంవంటివారు. శ్రీరామానుజుల పట్ల గొప్ప ప్రావణ్యాన్ని కలవారైన శ్రీవరవరమునులను నమస్కరిస్తున్నాను.

### వాఴిత్తిరునామమ్

ఇప్పువియిల్ అరఙ్గేశర్‌క్కు ఈడళిత్తాన్ వాఴియే
ఎఴిల్ తిరువాయ్‌మొఴిప్పిళ్ళై యిణైయడియోన్ వాఴియే
ఐప్పశియిల్ తిరుమూలత్తవరిత్తాన్ వాఴియే
అరవరశప్పెరుఞ్జోది యనన్దనెన్నుమ్ వాఴియే
ఎప్పొఴుదుమ్ శీశైల మేత్తవన్దోన్ వాఴియే
ఏరారు మెతిరాశ రెన వుదిత్తాన్ వాఴియే
ముప్పురినూల్ మణివడముమ్ ముక్కోల్ తరిత్తాన్ వాఴియే
మూదరియ మణవాళమామునివన్ వాఴియే

ఈభూమిలో శ్రీరంగనాథునకు తిరువాయ్‌మొఴి ప్రబంధానికి నమ్బిళ్ళై కృపజేసిన ఈడు అనే వ్యాఖ్యను కాలక్షేపంగా అనుగ్రహించిన వరవరమునులు వర్ధిల్లాలి. ప్రకాశించే తిరువాయ్‌మొఴిప్పిళ్ళై అనే ఆచార్యుల శ్రీపాదద్వంద్వాన్ని ఆశ్రయించిన

వారు వర్ధిల్లాలి. అల్పిశిమాసంలోని మూల అనే నక్షత్రంలో అవతరించినవారు వర్ధిల్లాలి. సర్పాలకు ప్రభువు అయిన గొప్ప జ్యోతిస్స్వరూపుడు అనంతుడు అయిన వరవర మునులు ఎల్లప్పుడు వర్ధిల్లాలి. ఎల్లప్పుడూ శ్రీశైలమనబడే వేంకటాచలాన్ని స్తుతించడం కోసం వచ్చిన వరవరమునులు వర్ధిల్లాలి. సౌందర్యం నిండిన యతిరాజులే అని భావించేటట్లు అవతరించిన వరవరమునులు వర్ధిల్లాలి. యజ్ఞోపవీతాన్ని తామర పూసల మాలెలను త్రిదండాన్ని ధరించిన వరవరమునులు వర్ధిల్లాలి సనాతనులైన, గొప్పవారైన మణవాళ మహామునులు వర్ధిల్లాలి.

## తిరునాళ్‌పాట్టు

శెన్దమిళ్ వేదియర్ శిన్దై తెళిన్దు శిఱన్దు మకిళ్న్దిడునాళ్
శీరులకారియర్ శెయ్‌దరుళ్ నఱ్కలై తేశు పొలిన్దిడునాళ్
మన్దమది ప్పువి మానిడర్తఙ్గళై వానిలుయర్త్తిడునాళ్
మాశఱు ఞానియర్‌శే రెతిశాశర్‌తమ్ వాళ్వు ముళైత్తిడునాళ్
కన్దమలర్ పొళిల్ శూళ్ కురుకాదిపన్ కలైకళ్ విళఙ్గిడునాళ్
కారమర్‌మేని యరఙ్గర్క్కు ఇణైకణ్‌కళ్ కళిత్తిడునాళ్
అన్దమిల్ శీర్ మణవాళముని ప్పరనవతారమ్ శెయ్‌దిడునాళ్
అళకు తికళ్న్దిడుమైప్పిశియిల్ తిరుమూలమదనైనాళే

ఋజువైన, అందమైన ద్రావిడవేదాన్ని తెలిసిన పండితుల మనస్సు తేటపడి గొప్పతనాన్ని పొంది ఆనందించే సుదినం, కల్యాణగుణగరిష్ఠులైన శ్రీపిళ్ళై లోకాచార్యుల వారు అనుగ్రహించిన గొప్ప శాస్త్రం అయిన శ్రీవచనభూషణంయొక్క తేజస్సు వర్ధిల్లే సుదినం, మందమతులైన భూమిలోని మానవులను పరమపదంలోనికి ఉద్ధరించే సుదినం, దోషం లేని జ్ఞానులు ఆశ్రయించే యతిరాజుల ఉజ్జీవనం అంకురించే సుదినం, సుగంధాన్ని కలిగిన పూలను కల తోటలు చుట్టి ఉండే కురుకాపురికి (ఆళ్వార్‌తిరు నగరికి) ప్రభువు అయిన నమ్మాళ్వార్ల శాస్త్రాలు (ప్రబంధాలు) వెలిగే సుదినం, మేఘంవంటి మేనిని కల శ్రీరంగనాథుని, తిరునేత్రాలు, సంతోషించే సుదినం. అంతులేని మహిమను (కల్యాణగుణాలను) కల సర్వోత్కృష్టులైన మణవాళమహాముని అవతరించిన సుదినం, ఏది? అని అంటే, అందం, శోభ ప్రకాశించే అల్పిశి మాసంలోని, అందమైన మూల అనే నక్షత్రమే.